# బ్రహ్మచర్యం



మసన చెన్నప్ప

# బ్రహ్మచర్యం

డా॥ మసన చెన్నప్ప

ప్రమీలా ప్రచురణలు
సికింద్రాబాదు

# BRAHMACHARYAM

by
**Dr. M.Chennappa,** MA, M Phil, Ph D
Dept of Telugu, Osmania University,
Hyderabad, A P - 500007



ప్రచురణ సంఖ్య 7
ప్రథమ ముద్రణ April, 1999
ప్రతులు : వెయ్యి
మూల్యం 20/-



ప్రతులకు
ప్రమీలా ప్రచురణలు,
12 - 11 - 1095/A
వారాసిగుడా,
సికింద్రాబాదు - 500061. ✆ 7640508

నవోదయ బుక్ హౌస్,
3 - 3 - 865, ఆర్యసమాజం ఎదురు వీధి,
కాచిగుడా, హైదరాబాదు - 500027

వైదిక సాహిత్యభండార్,
ఆర్యసమాజం, సుల్తాన్ బజార్,
హైదరాబాదు - 500195 ✆ 4751656

ముద్రణ
**Mounika Graphics**
1 - 4 - 27/71/187, P S Colony, Hyderabad - 080
✆ 7530142

Laser Type Setting
**Sanu Computer Graphics,** Kavadiguda ✆ 7538091

# పీఠిక

నాలుగు ఆశ్రమాలలో బ్రహ్మచర్యానికి గల స్థానం విశిష్టమైంది బ్రహ్మచర్యాన్ని పాటించడం వల్ల మానవులకు కలిగే ఐహిక, ఆముష్మిక ప్రయోజనాలను ప్రాచీనులు బాగా గుర్తించినారు నేను ఈ పుస్తకంలో అథర్వవేదం నుండి, మనుస్మృతి మొదలైనశాస్త్రగ్రంథాలనుండి, ఉపనిషత్తులనుండి, రామాయణ భారతాలనుండి బ్రహ్మచర్యానికి సంబంధించిన యథార్థమైన అంశాలను గ్రహించినాను వాటికి తోడుగా పాశ్చాత్య శాస్త్రవేత్తల దృక్పథాలను చూపెట్టినాను

పాశ్చాత్య నాగరికతప్రభావం వల్ల జీవిత పరమార్థాన్ని తెలుసుకోలేని యువతీయువకులకు ఈ పుస్తకం వెలుగు బాట చూపెడుతుంది ముఖ్యంగా అధ్యాపకులు ఈ పుస్తకం ద్వారా విద్యార్థిలోకానికి ఆదర్శజీవనాన్ని అందించాలని నా కోరిక విద్యా క్రీడా రంగాలలోనూ, సామాజిక ఆధ్యాత్మిక రంగాలలోనూ స్త్రీ పురుషుల వ్యక్తిత్వ నిర్మాణానికి, విజయానికి నూటికి నూరు పాళ్ల తోడ్పడే అద్భుతమైన వ్యవస్థ బ్రహ్మచర్యమే

అందరికి హితకరమైన ఈ కృతికి ప్రముఖ వ్యాపారవేత్తలు శ్రీనాళ్ల వీరయ్యగారు, వారిధర్మపత్ని శ్రీమతి రాజమణిగారు స్వీకర్తలు కావడం నా భాగ్యంగా భావిస్తున్నాను ఈ కృతి అచ్చురూపంలో రావడానికి ముఖ్యకారకులైన శ్రీకండె శంకరయ్యగారికి ప్రత్యేకంగా నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను నా రచనా వ్యాసంగానికి అన్ని విధాల సహకరించే ఆర్యసమాజం సీతాఫల్‌మండి వారికి, మాన్యమిత్రులు శ్రీ ఉప్పల యాదగిరి, శ్రీ ఎం ధనంజయునాయక్, శ్రీ పి రాజనరసింహారావు, శ్రీ జె. శివయ్య, శ్రీరావికంటి రాందేవ్ గార్లకు నా కృతజ్ఞతలు చెప్పుకొంటున్నాను

ఈ కృతికి చక్కని ముఖచిత్రాన్ని అందించిన ప్రముఖ చిత్రకారులు శ్రీ చందు గారికి, సకాలంలో కృతిని అచ్చు వేసి అందించిన నా బావమరది చిరంజీవి ఆర్. సంతోష్‌కుమార్‌కు నాకృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను

బృహద్గీత లాగానే ఈ పుస్తకాన్ని కూడా సహృదయ పాఠక లోకం ఆదరిస్తుందని ఆశిస్తున్నాను

వసవ చెన్నప్ప

## మసన చెన్నప్ప గారి రచనలు :

1980 – మల్లి పదాలు
(కూనలమ్మ ఛందస్సులో నూటఇరవై పదాలు)

1985 – వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయ సూచిక
(ఎం ఫిల్ – సిద్ధాంత వ్యాసం )

1991 – నేత్రోదయం
( వచన కవితా సంపుటి)

1991 – ప్రాచీన కావ్యాలు – గ్రామీణ జీవన చిత్రణ
(పిహెచ్ డి – సిద్ధాంత గ్రంథం)

1995 – సమాలోచనం
(సాహిత్య వ్యాస సంపుటి)

1997 – బృహద్గీత
( బృహదారణ్యకోపనిషత్తుకు తెలుగు సేత –
పన్నెండువందల ముత్యాల సరాలలో)



# అనుక్రమణిక

# బ్రహ్మచర్యం

## బ్రహ్మచర్యం అంటే ఏమిటి?

మనస్సునూ, శరీరాన్నీ ఆరోగ్యంగా ఉంచి మానవుణ్ణి ఉన్నత శిఖరాలకు అధిరోహింప జేసేది బ్రహ్మచర్యం కనుకనే మానవులు ఆచరింపదగిన నాలుగు ఆశ్రమాలలో బ్రహ్మచర్యం మొదట చెప్పబడింది పతంజలి అష్టాంగ యోగంలో బ్రహ్మచర్యానికి ప్రత్యేక స్థానం ఈయబడింది బ్రహ్మచర్యం స్త్రీ పురుషులు సమానంగా ఆచరింపదగిన వ్రతం

బ్రహ్మచర్యానికి వీర్యరక్షణ అనే స్థూలమైన అర్థాన్ని చెప్పవచ్చు కాని నిజానికది శ్రేష్ఠమైన తపస్సు గొప్పసాధన ఈ సాధనకు ఫలం ఆత్మ సాక్షాత్కారం ఆత్మ సాక్షాత్కారం లభించినప్పుడే బ్రహ్మచర్యం యొక్క పూర్ణావిష్కారం జరిగినట్లు భావించాలి

బ్రహ్మచర్యం లో రెండు శబ్దాలున్నాయి బ్రహ్మ శబ్దానికి అనేకార్థాలున్నప్పటికి ఈశ్వరుడు, వేదం, జ్ఞానం, వీర్యం అనే అర్థాలను ప్రధానంగా గుర్తించాలి అలాగే చర్య శబ్దానికి చింతన, అధ్యయనం, ఉపార్జన, రక్షణ అనే అర్థాలను గ్రహించాలి అప్పుడు బ్రహ్మచర్యం అంటే ఈశ్వర చింతన, వేదాధ్యయనం, జ్ఞానోపార్జన, వీర్యరక్షణ అనే అర్థాలు సిద్ధిస్తాయి ఈ నాలుగు అర్థాలను సమన్వయించినప్పుడు మానవులు వీర్యాన్ని రక్షించుకోవడమే కాక వేదాధ్యయనపరులై, జ్ఞాన సంపాదన చేస్తూ, ఈశ్వరచింతన ద్వారా ముక్తిని పొందాలనే విషయం స్పష్టమవుతుంది బ్రహ్మచర్యం మోక్షానికి హేతువని ధ్రువపడుతుంది

## ఆశ్రమాలలో బ్రహ్మచర్యానికి గల స్థానం:

మానవులు తమ జీవితకాలంలో బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం, సంన్యాసం అనే నాల్గు ఆశ్రమాలు ఆచరింపదగ్గవి బ్రహ్మచర్యాశ్రమం ద్వారా మంచి శిక్షణ, సత్యవిద్యలను గ్రహించాలి. గృహస్థాశ్రమంలో ఉత్తమ సంతానాన్ని పొంది, ఆ సంతానానికి ఉత్తమ విద్యలద్వారా ఉత్తమ సంస్కారాలను కలిగించాలి అతిథిసత్కారాలను పాటించాలి వానప్రస్థాశ్రమంలో బ్రహ్మవిద్యాదులను స్వయంగా సాధించి, పరమేశ్వరుణ్ణి ఉపాసించే విధానాన్ని అలవర్చుకోవాలి సంన్యాసాశ్రమంలో మోక్షసుఖప్రాప్తి కొరకు, లోకోపకారం కొరకు ప్రయత్నించాలి సత్యోపదేశం చేయాలి

# బ్రహ్మచర్యం

## బ్రహ్మచర్యం అంటే ఏమిటి?

మనస్సునూ, శరీరాన్నీ ఆరోగ్యంగా ఉంచి మానవుణ్ణి ఉన్నత శిఖరాలకు అధిరోహింప జేసేది బ్రహ్మచర్యం కనుకనే మానవులు ఆచరింపదగిన నాలుగు ఆశ్రమాలలో బ్రహ్మచర్యం మొదట చెప్పబడింది పతంజలి అష్టాంగ యోగంలో బ్రహ్మచర్యానికి ప్రత్యేక స్థానం ఈయబడింది బ్రహ్మచర్యం స్త్రీ పురుషులు సమానంగా ఆచరింపదగిన వ్రతం

బ్రహ్మచర్యానికి వీర్యరక్షణ అనే స్థూలమైన అర్థాన్ని చెప్పవచ్చు కాని నిజానికది శ్రేష్ఠమైన తపస్సు గొప్పసాధన ఈ సాధనకు ఫలం ఆత్మ సాక్షాత్కారం ఆత్మ సాక్షాత్కారం లభించినప్పుడే బ్రహ్మచర్యం యొక్క పూర్ణావిష్కారం జరిగినట్లు భావించాలి

బ్రహ్మచర్యం లో రెండు శబ్దాలున్నాయి బ్రహ్మ శబ్దానికి అనేకార్థాలున్నప్పటికి ఈశ్వరుడు, వేదం, జ్ఞానం, వీర్యం అనే అర్థాలను ప్రధానంగా గుర్తించాలి అలాగే చర్య శబ్దానికి చింతన, అధ్యయనం, ఉపార్జన, రక్షణ అనే అర్థాలను గ్రహించాలి అప్పుడు బ్రహ్మచర్యం అంటే ఈశ్వర చింతన, వేదాధ్యయనం, జ్ఞానోపార్జన, వీర్యరక్షణ అనే అర్థాలు సిద్ధిస్తాయి ఈ నాలుగు అర్థాలను సమన్వయించినప్పుడు మానవులు వీర్యాన్ని రక్షించుకోవడమే కాక వేదాధ్యయనపరులై, జ్ఞాన సంపాదన చేస్తూ, ఈశ్వరచింతన ద్వారా ముక్తిని పొందాలనే విషయం స్పష్టమవుతుంది బ్రహ్మచర్యం మోక్షానికి హేతువని ధ్రువపడుతుంది

## ఆశ్రమాలలో బ్రహ్మచర్యానికి గల స్థానం:

మానవులు తమ జీవితకాలంలో బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం, సంన్యాసం అనే నాల్గు ఆశ్రమాలు ఆచరింపదగ్గవి బ్రహ్మచర్యాశ్రమం ద్వారా మంచి శిక్షణ, సత్యవిద్యలను గ్రహించాలి. గృహస్థాశ్రమంలో ఉత్తమ సంతానాన్ని పొంది, ఆ సంతానానికి ఉత్తమ విద్యలద్వారా ఉత్తమ సంస్కారాలను కలిగించాలి అతిథిసత్కారాలను పాటించాలి వానప్రస్థాశ్రమంలో బ్రహ్మవిద్యాదులను స్వయంగా సాధించి, పరమేశ్వరుణ్ణి ఉపాసించే విధానాన్ని అలవర్చుకోవాలి సంన్యాసాశ్రమంలో మోక్షసుఖప్రాప్తి కొరకు, లోకోపకారం కొరకు ప్రయత్నించాలి సత్యోపదేశం చేయాలి

ధర్మార్థకామమోక్షాలను సాధించడానికి మానవులందరూ ఈ నాలుగురకాలైన ఆశ్రమ ధర్మాలను నిర్వహించాలి ఐతే వీటిలో బ్రహ్మచర్యాశ్రమధర్మం తక్కిన ఆశ్రమాలకన్నింటికి మూలం బ్రహ్మచర్యాశ్రమాన్ని బాగా నిర్వహిస్తే తక్కిన ఆశ్రమాలు చక్కగా నిర్వహింపబడుతాయి ఒకవేళ మొదటి ఆశ్రమానికే దెబ్బతగిలితే తక్కిన మూడు వ్యర్థమవుతాయి

## అధర్వవేదం - బ్రహ్మచర్యవైశిష్ట్యం:

"ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణం కృణుతే గర్భమంతః
తం రాత్రీస్తిస్ర ఉదరే బిభర్తి తం జాతం ద్రష్టుమభిసంయంతి దేవా"
11-3-5-5

మానవునికి తల్లిదండ్రుల వల్ల ప్రథమజన్మ లభిస్తుంది ఆచార్యునిచే ఉపనయన సంస్కారం వల్ల ద్విజన్మ సిద్ధిస్తుంది ఈ ద్విజన్మ కారణంగానే మానవునికి మనుష్యత్వం సంప్రాప్తమవుతుంది ఆచార్యునిచే ఉపదేశాన్ని పొందినప్పటినుండి బాలకులు బ్రహ్మచారులుగా, బాలికలు బ్రహ్మచారిణులుగా పిలువబడుతారు. వారు గురుకులంలో ఉన్న మొదటి మూడు రోజులకు ఎంతో ప్రాధాన్యం ఉంది వారిని తనగర్భంలో దాచుకొన్నాడా? అన్నట్లు ఆచార్యుడు నడుచుకొంటాడు అంతేకాదు పరమేశ్వర స్వరూపాన్ని తెలిపి ఎలా ఆరాధించాలో ఉపదేశిస్తాడు ఆ సందర్భంలో బ్రహ్మచారులను చూడడానికి ఇతర విద్వాంసులు, అధ్యాపకులు వస్తారు అలా వచ్చినవారు బ్రహ్మచారుల సత్ప్రవర్తనకు సంతోషించి "అదృష్టంవల్ల, ఈశ్వరుని కృపవల్ల మానవాళికి ఉపకారం చేసే నిమిత్తం మీరు మాలో విద్వాంసులయ్యారు" అని ప్రశంసిస్తారు

"ఇయం సమిత్ పృథివీ ద్యౌర్ ద్వితీయోతాంతరిక్షం సమిధా పృణాతి,
బ్రహ్మచారీ సమిధా మేఖలయా శ్రమేణ లోకాం స్తపసా పిపర్తి" 11-3-5-4

బ్రహ్మచారి సమిధతో పృథివి, ఆకాశం, అంతరిక్షం మూడింటిని పాలిస్తాడు అంతేకాదు, (సమిధా) అగ్నిహోత్రాదులతోను, (మేఖలయా) బ్రహ్మచారి ధరించే చిహ్నాలతోను, (శ్రమేణ) పరిశ్రమతోను, (తపసా) ధర్మానుష్ఠానంతోను (లోకాన్) సర్వప్రాణులను ప్రసన్నులను చేస్తాడు

"పూర్వోజాతో బ్రహ్మణో బ్రహ్మచారీ ఘర్మం వసానస్తపసోదతిష్ఠత్ తస్మాజ్జాతం బ్రాహ్మణం బ్రహ్మజ్యేష్ఠం దేవాశ్చ సర్వే అమృతేన సాకమ్" 11-3-5-5

వేదమార్గంలో నడిచి, ధర్మనుష్ఠానంవల్ల ఉత్కృష్టమైన జ్ఞానాన్ని పొంది, పరమేశ్వరుణ్ణి అన్నింటి కంటె శ్రేష్ఠునిగా సంభావించి ఉపాసనద్వారా మోక్షానందాన్ని, పొంద గలిగిన బ్రహ్మచారిని విద్వాంసులు ప్రశంసిస్తారు

"బ్రహ్మచార్యేతి సమిధా సమిద్ధః కార్ష్ణంవసానో దీక్షితో దీర్ఘశ్మశ్రుః, స సద్య ఏతి పూర్వస్మాదుత్తరం సముద్రం లోకాన్ త్సంగృభ్యముహురాచరిక్రత్" 11-3-5-6

బ్రహ్మచారి వేదవిద్యతో ప్రకాశిస్తాడు మృగచర్మాదులను ధరించి చాల కాలం జుట్టూ, మీసాలు కలిగి ఇంద్రియాదులను జయిస్తాడు బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు తాను సంపాదించిన విద్యతో బ్రహ్మచర్యాశ్రమమనే పూర్వ సముద్రాన్ని దాటి ఉత్తర సముద్రరూపమైన గృహస్థాశ్రమాన్ని ఆశ్రయిస్తాడు నివాసయోగ్యమైన ప్రదేశాలలో యోగ్యులను సంపాదించి మాటి మాటికి వేదోపదేశం చేస్తాడు

"బ్రహ్మచారీ జనయన్ బ్రహ్మాపో లోకం ప్రజాపతిం పరమేష్ఠినం విరాజమ్,
గర్భో భూత్వామృతస్య యోనావింద్రో హ భూత్వాஉసురాం స్తతర్హ" 11-3-5-7

బ్రహ్మచారి వేదవిద్యను యధార్థంగా తెలుసుకొంటాడు ప్రాణ విద్యను, లోక విద్యను గ్రహిస్తాడు సర్వశ్రేష్ఠుడు, సర్వప్రకాశకుడు, ప్రజాపతి ఐన పరమేశ్వరుని స్వరూపాన్ని గ్రహించి మోక్ష విద్యను నియమపూర్వకంగా అభ్యసించి సూర్యునిలా ప్రకాశిస్తాడు అవిద్య అనే అంధకారాన్ని ఛేదిస్తాడు

"బ్రహ్మచర్యేణ తపసా రాజా రాష్ట్రం విరక్షతి
ఆచార్యో బ్రహ్మచర్యేణ బ్రహ్మచారిణ మిచ్ఛతే" 11-3-5-17

బ్రహ్మచర్యం బాగా పాటించిన రాజు ప్రజలను రక్షించడానికి యోగ్యుడైనట్లే ఆచార్యుడు కూడా బ్రహ్మచర్యవ్రతాన్ని పాటించి, విద్యార్థులను రక్షించడానికి యోగ్యుడౌతాడు

"బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిమ్,
అనడ్వాన్ బ్రహ్మచర్యేణాశ్వో ఘాసం జిగీషతి" 11-3-5-18

బ్రహ్మచర్యాశ్రమంలో అమ్మాయి చదువుకొని యువావస్థను పొందిన తరువాతనే యువకుణ్ణి భర్తగా స్వీకరించాలి ఇట్లే అబ్బాయి కూడా బ్రహ్మచర్యాన్ని పాలించి విద్వాంసుడై, సుశీల ఐన యువతిని ప్రసన్నతాపూర్వకంగా వివాహం చేసుకోవాలి ఇద్దరూ పరస్పరం సుఖదుఃఖాలలో సహాయకులౌతూ జీవించాలి ఉదాహరణకు పశువులు కూడా యువావస్థను పొందేదాకా బ్రహ్మచర్యాన్ని పాలించి బలం గలవి, వేగం గలవి అవుతాయి తమకు శత్రువులైన జంతువులను జయించి జీవింపగలుగుతాయి కనుక మానవులు బ్రహ్మచర్యాన్ని తప్పక అవలంబించాలి

"బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుముపాఘ్నత,
ఇంద్రోహ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వరాభరత్" 11-3-5-19

జ్ఞానులు బ్రహ్మచర్యమనే తపస్సు చేత మృత్యువును జయిస్తారు
పరమేశ్వరుడు బ్రహ్మచర్యం ద్వారా దేవతలకు సుఖాన్ని ప్రాప్తింపజేస్తాడు

అథర్వవేదం లోని ఈ మంత్రాలవల్ల గృహస్థాశ్రమానికి ముందు బాలబాలికలు బ్రహ్మచర్యాన్ని పాటించాలనీ, బ్రహ్మచర్యమే తక్కిన ఆశ్రమాలకు మూలమనీ, శిష్యులకు విద్యాబోధన చేసే ఆచార్యులు బ్రహ్మచర్య వ్రతశీలురై ఉండాలనీ, అప్పుడే విద్యార్థులు మంచిపౌరులుగా వారి దేశానికి ఉపయోగ పడుతారని తెలుస్తుంది. అంతేకాక బ్రహ్మచర్యదీక్షవల్ల మోక్షానందాన్ని అనుభవించ వచ్చునని స్పష్టమవుతుంది

## మనుస్మృతి – బ్రహ్మచర్యాశ్రమం:

మనుస్మృతిలో తల్లిదండ్రుల యొక్క, ఆచార్యుని యొక్క గొప్పతనం తో పాటు బ్రహ్మచారి యొక్క విధులు నిర్దేశింపబడినాయి వేదం గాని, వేదాంగాలనన్నింటిని గాని డబ్బు తీసుకొని బోధించే వాడు ఉపాధ్యాయుడని చెప్పబడింది యజ్ఞోపవీతధారణ చేయించి శిష్యునికి వేదంతో పాటు, ఉపనిషత్తులను బోధించే ద్విజుడు ఆచార్యుడని చెప్పబడింది ఉపాధ్యాయుని కంటె ఆచార్యుడు పదిరెట్లెక్కువగా, ఆచార్యుని కంటె తండ్రి

వంద రెట్లెక్కువగా, తండ్రి కంటె తల్లి వేయి రెట్లెక్కువగా గౌరవార్హులని మనుస్మృతి లో చెప్పబడింది

"ఉపాధ్యాయాన్ దశాచార్యం ఆచార్యాణాం శతం పితా,
సహస్రంతు పితౄన్ మాతా గౌరవేణాతిరిచ్యతే" 1 145

వేదజ్ఞుడైన ఆచార్యుడు మనుష్య సంతానానికి గాయత్రీ మంత్రోపదేశం ద్వారా రెండవ జన్మను కలిగిస్తాడు తల్లిదండ్రులిచ్చిన శరీరం అనిత్యమై నశిస్తుంది కాని, ఆచార్యుడిచ్చిన జ్ఞానరూప శరీరం మాత్రం ఈ జన్మలోనే కాక పరజన్మలోనూ ఉపకరిస్తుంది వేద విద్యారూపమైన జన్మను ఇచ్చేవాడు బాలుడైనప్పటికీ అతడు వయస్సులో తనకంటె పెద్దవారికి తండ్రి వంటి వాడవుతాడు మానవ సమాజంలో వేదాన్ని అధ్యయనం చేసి, దాని అర్థం తెలిసిన వాడే గొప్పవాడు. వయస్సులో పెద్దవాడు కాని, వెండ్రుకలు నెఱిసిన వాడు కాని, ధనవంతుడు కాని గొప్పవాడు ఎంత మాత్రం కాడు జ్ఞానం చేత విప్రులకు పరాక్రమం చేత క్షత్రియులకు ధనధాన్యాదుల చేత వైశ్యులకు పుట్టుకచేత శూద్రులకు గొప్పతనం లభిస్తుంది కాని వేదవిద్యలేనివాడు బ్రాహ్మణుడు కాడు ద్విజుడైనవాడు వేదాన్ని పఠించక ఏదో విధంగా బ్రతకడానికి ప్రయత్నిస్తే అతడు తన వంశంతో పాటు శూద్రత్వాన్ని పొందుతాడు

"యోఽనధీత్య ద్విజో వేద మన్యత్ర కురుతే శ్రమమ్,
స జీవన్నేవ శూద్రత్వ మాశుగచ్ఛతి సాన్వయః" 1 168

వైదిక సిద్ధాంతం ప్రకారం మనిషికి మూడు జన్మలుంటాయి మొదటి జన్మ తల్లి గర్భం నుండి లభిస్తుంది రెండవ జన్మ ఉపనయనం వల్ల కలుగుతుంది మూడవ జన్మ యజ్ఞదీక్ష వల్ల ఏర్పడుతుంది

"మాతురగ్రేఽధిజననం ద్వితీయం మౌంజి బంధనే,
తృతీయం యజ్ఞ దీక్షయా ద్విజస్య శ్రుతి చోదనాత్" 1 169

వేదం పఠించనంత వరకు ఏ మనుష్యుడైనా శూద్రుడుగానే ఉంటాడు ఆచార్యుడు ఉపనయనం చేసి, వేదాన్ని పఠింపజేస్తే ద్విజుడౌతాడు

"నాభి వ్యాహారయేద్బ్రహ్మ స్వధానినయనా దృతే
శూద్రేణ హి సమస్తావద్యావద్వేదే న జాయతే" 1 172

వేదాన్ని పఠింపజేసే ఆచార్యుడు పితరుడుగా వ్యవహరింప బడుతాడు ఉపనయనం కానంత వరకు బాలునికి యజ్ఞాది క్రియలు చేసే అర్హత ఉండదు ఉపనయనం జరిగిన తర్వాత బ్రహ్మచర్యాన్ని గూర్చి ఉపదేశించాలి. విధిపూర్వకంగా వేదపఠనం ఆరంభించాలి బ్రహ్మచారి ఇంద్రియాలను వశంలో ఉంచుకొని విద్యాభివృద్ధికొరకు గురువు చెప్పిన నియమాలను పాటించాలి ముఖ్యంగా మద్యమాంసాదులను, సుగంధద్రవ్యాలను, పూలమాలల ను, రుచులను, స్త్రీలసాన్నిహిత్యాన్ని విడిచిపెట్టాలి ఏప్రాణినీ హింసించ రాదు

"వర్జయేన్మధుమాంసంచ గంధం మాల్యం రసాన్ స్త్రియః,
శుక్తాని యాని సర్వాణి ప్రాణినాం చైవ హింసనమ్" 1 177

జూదం ఆడడం, తగవులాడడం, ఇతరుల విషయంలో వ్యర్థాలాపం చేయడం, అబద్ధాలాడడం, కామేచ్ఛతో స్త్రీలను చూడడం, స్పృశించడం, హాని కల్గించడం బ్రహ్మచారికి తగని పనులు

బ్రహ్మచారి ఒంటరిగా పడుకోవాలి. ఎన్నడూ వీర్యస్ఖలనం చేయ రాదు కామేచ్ఛతో వీర్యస్ఖలనం చేస్తే బ్రహ్మచర్య వ్రతాన్ని భగ్నం చేసినట్లవుతుంది

బ్రహ్మచారి ప్రతిదినం ఆచార్యుని ప్రేరణతో గాని, ప్రేరణ లేకుండా గాని వేదాన్ని పఠించ వచ్చు ఏ సమయంలోనూ ఆచార్యునికి హాని తలపెట్ట రాదు. విద్వాంసుడు గాని, మూర్ఖుడు గాని కామక్రోధాదులకు లోనైనప్పుడు లేదా స్త్రీల సంపర్కం ఏర్పడినప్పుడు చెడిపోయే ప్రమాదం ఉంది. కనుక బ్రహ్మచారి జాగ్రత్తగా నడుచుకోవాలి మానవుడు పలుగుపారలతో భూమిని త్రవ్వి నీటిని ఏవిధంగా పొందగల్గుతాడో, శిష్యుడు కూడ ఆచార్యునికి శుశ్రూష చేసి విద్యను సంపాదించాలి ప్రతిదినం నియమంగా ప్రాతఃకాలంలోను, సాయంకాలంలోను పవిత్రమైన స్థానంలో కూర్చొని ఆచమనం చేసి గాయత్రీ మంత్రాన్ని జపిస్తూ ఈశ్వరుణ్ణి ఉపాసించాలి. సూర్యోదయానికి తర్వాత గాని,

సూర్యాస్తమయానికి ముందుగాని నిద్రించరాదు ఆచార్యుడు, తండ్రి-తల్లి వీరిలో ఎవ్వరు కష్టస్థితిలో ఉన్నా, వారినెంత మాత్రం అవమానించరాదు ఆచార్యుడు బ్రహ్మయొక్కమూర్తి బ్రహ్మ ఏవిధంగా మొట్ట మొదట వేదాన్ని పఠింపజేసాడో ఆచార్యుడు కూడా అదేవిధంగా వేదాన్ని పఠింపజేస్తాడు కాబట్టి, అతణ్ణి బ్రహ్మలా గౌరవించాలి తల్లి తనను నవమాసాలు గర్భంలో ధరించి రక్షిస్తుంది కనుక ఆమెను పృధివి లా గౌరవించాలి. సోదరులూ, తానూ సమానమైన జన్మ కల్గినవారు కాబట్టి పరస్పరం గౌరవించు కోవాలి పిల్లలను తీర్చిదిద్దడంలో తల్లి దండ్రులెంతో కష్టపడుతారు అట్టి తల్లిదండ్రుల కష్టాన్ని తీర్చుకోవడానికి పిల్లలకు నూరేండ్లైనా సరిపోవు కనుకనే ఎల్లప్పుడు పిల్లలు తల్లిదండ్రులకు ప్రియమే ఆచరించాలి ఇట్లే ఆచార్యునికి కూడా ప్రియమే ఆచరించాలి వీరు ముగ్గురు సంతోషిస్తే బ్రహ్మచారి తపస్సు ఫలించినట్లే అవుతుంది

మనుస్మృతిలో తల్లి, తండ్రి, ఆచార్యుని సేవ తపస్సుగా చెప్పబడింది వారి ముగ్గురి అనుమతి లేకుండా ఏ ధర్మమూ ఆచరించ రాదు. తల్లి, తండ్రి, ఆచార్యుడు ముగ్గురూ మూడు ఆశ్రమాల వంటి వారు. తల్లి బ్రహ్మచర్యం, తండ్రి గార్హస్థ్యం, ఆచార్యుడు వానప్రస్థం ముగ్గురూ మూడు వేదాల వంటి వారు తల్లి ఋగ్వేదం, తండ్రి యజుర్వేదం, ఆచార్యుడు సామవేదం. ముగ్గురూ త్రేతాగ్నుల వంటి వారు తల్లి దక్షిణాగ్ని, తండ్రి గార్హపత్యాగ్ని, ఆచార్యుడు ఆహవనీయాగ్ని.

మూడు వేదాలను చదవగోరే బ్రహ్మచారి ఆచార్యుని వద్ద ముప్పై ఆరు సంవత్సరాలు ఉండాలి లేదా అందులో సగం గాని, నాల్గవ వంతు గాని లేదా వేదాలను పూర్తిగా గ్రహించే వరకు గాని ఉండాలి ఒక్కొక్క వేదం చదవడానికి పన్నెండు సంవత్సరాలు పడుతుంది. కాని బ్రహ్మచారి యోగ్యతను బట్టి అధ్యయన కాలం మారుతుంది. మనుష్యుడు వేదాలను నాల్గింటిని గాని రెండింటిని గాని లేదా ఒకదాన్ని గాని పఠించి, బ్రహ్మచర్యాన్ని పాటించి ఆ తర్వాత గృహస్థాశ్రమాన్ని స్వీకరించవచ్చు కాని ఒక్క వేదాన్నైనా చదవక గృహస్థాశ్రమంలో ప్రవేశించడం తగదు

తల్లి, తండ్రి, ఆచార్యుడు ముగ్గురూ మూడు ఆశ్రమాలతోను, మూడు వేదాలతోను, మూడు అగ్నులతోను పోల్చబడడం వల్ల వారి స్థానం ఎంత పవిత్రమైందో

ఊహించ వచ్చు ఈ ముగ్గురిని ఆదరించిన వాడు అన్ని ధర్మాలు ఆచరించిన వాడవుతాడు బ్రహ్మచర్యానికి లోటు రాకుండా వ్యవహరించినప్పుడు బ్రహ్మచారికి ఉత్తమ స్థానం లభిస్తుందని మనుస్మృతి తెలియజేస్తుంది

## ఛాందోగ్యోపనిషత్తు – త్రివిధ బ్రహ్మచర్యం :

ఛాందోగ్యోపనిషత్తు బ్రహ్మచర్యాన్ని మూడు విధాలుగా పేర్కొంటున్నది ఒకటి, కనిష్ఠ బ్రహ్మచర్యం రెండు, మధ్యమ బ్రహ్మచర్యం మూడు, ఉత్తమ బ్రహ్మచర్యం

## కనిష్ఠ బ్రహ్మచర్యం :

ఇరవై నాలుగేండ్ల వరకు పాటించే బ్రహ్మచర్యం కనిష్ఠ బ్రహ్మచర్యం దీనిలో బ్రహ్మచారి ఇంద్రియాలను జయించి, వేదాది విద్యలను గ్రహించి, యమనియమాలను పాటిస్తాడు అప్పుడతని శరీరగతమైన ప్రాణాలు శక్తివంతమై ధైర్యాది సద్గుణాలను అతనిలో ప్రవేశింప జేస్తాయి ఆచార్యుడీ సమయంలోనే బ్రహ్మచారిని ఆయా విద్యల ద్వారా మిక్కిలి సంతృప్తుణ్ణి చేస్తాడు ఈ దశలో బ్రహ్మచర్యం సరిగా పాటింపబడడం వల్ల ఆయువు వృద్ధియై, ఆరోగ్యవంతమై కష్టసుఖాలను అనుభవించడానికి కావలసిన శక్తి లభిస్తుంది అందుకే ఇరవై నాలుగు ఏండ్ల తరువాత మాత్రమే పురుషులకు గృహస్థాశ్రమంలో ప్రవేశించే అర్హత కల్పించ బడింది

## మధ్యమ బ్రహ్మచర్యం :

మనుష్యుడు నలభై నాల్గేండ్ల వరకు బ్రహ్మచారిగా ఉండి వేదాభ్యాసం చేసినట్లైతే అతని ప్రాణాలు, ఇంద్రియాలు, మనస్సు, ఆత్మ అత్యధిక బలాన్ని సంతరించుకొని శిష్టులను పాలించడంలోను, దుష్టులను శిక్షించడంలోను సహాయకారులౌతాయి ప్రథమ వయస్సులోనే జితేంద్రియుడు కాగలిగితే రుద్రరూపప్రాణాలతో కూడిన మధ్యమ బ్రహ్మచర్యం సిద్ధిస్తుంది కనుక ఇరవై నాల్గు ఏండ్ల లోపల నే మనుష్యుడు తన బ్రహ్మచర్యాన్ని పెంపు చేసుకోవాలి దానికి ఏ సమయంలోను దెబ్బ తగల నీయ రాదు బ్రహ్మచర్యానికి లోపం రానీయక ప్రవర్తించే మనుష్యులు యజ్ఞస్వరూపులు కాగలుగుతారు

## ఉత్తమ బ్రహ్మచర్యం :

నలభై ఎనిమిది సంవత్సరాల వరకు బ్రహ్మచర్యాన్ని పాటిస్తే అది ఉత్తమ బ్రహ్మచర్యం. 'జగతి' అనే ఛందస్సులో నలభై ఎనిమిది అక్షరాలు ఉన్నట్లు, నలభై ఎనిమిది ఏండ్లు బ్రహ్మచర్యాన్ని పాటించిన మానవునికి ప్రాణాలు అనుకూలంగా ఉండి అన్ని విద్యలను గ్రహించడానికి తోడ్పడుతాయి తల్లిదండ్రులు, ఆచార్యుడు తమ సంతానానికి ప్రథమ వయస్సులో ఇంద్రియాలను నిగ్రహించుకొనే విధంగా శిక్షణ ఇచ్చినట్లయితే ఆ సంతానం తమకు తామే అఖండ బ్రహ్మచర్యాన్ని అవలంబించి మూడవది ఐన ఉత్తమ బ్రహ్మచర్యాన్ని సాధించి నాలుగు వందల సంవత్సరాల వరకు తమ ఆయుస్సును పెంచుకొనే అవకాశం ఉంది. ఏ మనుష్యుడీ బ్రహ్మచర్యాన్ని లోపం లేకుండా పాటిస్తాడో, అతడు సర్వ రోగాలకు దూరంగా ఉండి ధర్మార్థకామమోక్షాలను పొందుతాడు

## తైత్తిరీయోపనిషత్తు - ఆచార్యోపదేశం :

ఆచార్యులు తమ శిష్యులకు, శిష్యురాండ్రకు చేయవలసిన ఉపదేశం ఎలాంటిదో తైత్తిరీయోపనిషత్తులోని శిక్షావల్లి ద్వారా తెలుస్తుంది.

ఎల్ల వేళల సత్యమే చెప్పాలి. ధర్మాన్ని ఆచరించాలి సోమరితనం వదలి చదవాలి, చదివించాలి పూర్ణబ్రహ్మచర్యం తో అన్ని విద్యలను ఆర్జించాలి ఆచార్యుడు కోరిన ధనాన్ని ఈయాలి ధర్మబద్ధంగా వివాహమాడి మంచి సంతానాన్ని పొందాలి. సోమరితనం వల్ల సత్యాన్ని చెప్పడం మానరాదు. ధర్మాచరణను విడవరాదు ఎల్ల వేళల ఆరోగ్యాన్ని కాపాడు కోవాలి. నైపుణ్యాన్ని పెంచుకోవాలి ఎప్పుడూ ఉత్తమ సంపదలను వృద్ధి పరచుకోవడం మానరాదు విద్వాంసులను, తల్లిదండ్రులను సేవించడంలో పొరపాటు చేయరాదు. విద్వాంసులను సత్కరించినట్లే తల్లిదండ్రులను, ఆచార్యుణ్ణి, అతిథులను సేవించాలి ఎవరూ నిందించని, ధర్మయుక్తమైన సత్కర్మలనే ఆచరించాలి సత్య సంభాషణ కొనసాగించాలి. మిథ్యాభాషణ చేయ రాదు. సచ్చరిత్రలను చదవాలి. సత్కర్మలను గ్రహించాలి. పాపకర్మలు ఎంత పెద్దవారు చేసినా సహించ రాదు ఆచరించరాదు ఉత్తమ విద్వాంసులను, ధర్మాత్ములను విశ్వసించాలి. పెద్దలు నిలబడినప్పుడు కూర్చోవడానికి తగిన ఆసనాలను ఇచ్చి సత్కరించాలి శ్రద్ధతో గాని అశ్రద్ధతో గాని అన్నాదులను ఇచ్చి సంతృప్తి పరచాలి.

కాని, వాటిని సంపదకు తగినట్లు ఈయాలి ఇచ్చి గర్వించరాదు సిగ్గుపడుతూ ఇచ్చినా పొరపాటేమీ లేదు

ఈయగలిగినంత ఈయనందుకు పాపం కలుగుతుందనే భయం ఉన్నా ఈయవచ్చు ఇచ్చింది తెలిసి ఈయాలి దుర్వినియోగం కాకుండా చూసి ఈయాలి.

వైదిక సిద్ధాంత విషయంలోగాని, ఆచరణలోగాని, అనుమానాలు ఏర్పడినప్పుడు సమదర్శనులు, ధార్మికులు, కరుణాపరులైన విద్వాంసులను ఆశ్రయించి వారి ద్వారా సత్యాన్ని గ్రహించి వ్యవహరించాలి ఇదే వేదాజ్ఞ ఇదే వేదోపదేశం ఇదే కర్తవ్యం దీని వల్లనే మానవాళికి మేలు కలుగుతుంది

పతంజలి యోగదర్శనంలో యమనియమాలు మానవునికి అవశ్యం ఆచరింపదగిన వ్రతాలుగా పేర్కొనబడ్డాయి అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం - ఈ ఐదు మనస్సుతోపాటు నేత్రాది ఇంద్రియాలను వాటి విషయాలనుండి యమింపజేస్తాయి కనుక యమాలుగా పిలువబడినాయి బ్రహ్మచర్యం సిద్ధించిన వారికి మిక్కిలి సామర్థ్యం కలుగుతుందని పతంజలి చెప్పినాడు

''బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్య లాభః'' సాధనపాదం -1 38

బ్రహ్మచర్యం సిద్ధించిన యోగికి అష్టసిద్ధులు కలుగుతాయి తారం, సుతారం, తారతారం, రమ్యకం, సదాముదితం, ప్రమోదం, ప్రముదితం, ప్రమోదమానం అనేవే ఆ అష్టసిద్ధులు

## బృహదారణ్యకం – గాయత్రీ మంత్ర ప్రభావం :

ఆచార్యుడు బ్రహ్మచారులకు ఉపనయన సందర్భంలో ఉపదేశించే మంత్రమే గాయత్రి 'గాయంతం త్రాయతే ఇతి గాయత్రీ' గానం చేసిన వారిని రక్షించే మంత్రమే గాయత్రి గాయత్రికే సావిత్రి అని పేరు గాయత్రి సవితకు సంబంధించిన మంత్రం కాబట్టి సావిత్రి అనే పేరుతో పిలవబడుతుంది సవిత అంటే సృష్టి కర్త కొందరు అజ్ఞానంతో గాయత్రిని సూర్యోపాసన మంత్రంగా లెక్కిస్తారు కాని అది సరికాదు సూర్యుడు సృష్టికర్త కాడు పరమేశ్వరుని సృష్టిలో భాగం జడపదార్థం

మనన చెన్నప్ప

గాయత్రికి గల విశేషార్థాన్ని మనం తెలుసుకోవచ్చు మన శరీరంలో పది ప్రాణాలున్నాయి అవి ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం, నాగం, కూర్మం, కృకలం, దేవదత్తం, ధనంజయం ఈ ప్రాణాలకే గయ అని పేరు ప్రాణాల (గయ) ను రక్షించే (త్రాణ) మంత్రమే గాయత్రి

ఆచార్యుడు బాల బ్రహ్మచారులకు ఉపనయన సమయంలో గాయత్రిని అర్థయుక్తంగా ఉపదేశిస్తాడు పరోక్షంగా వారి ప్రాణాలకు రక్షణ కల్పిస్తాడు ఒక్క మాటలో చెప్పాలంటే గాయత్రి మానవ శరీరాలకు రక్షాకవచం వంటిది గాయత్రీ ఉపాసన వల్ల ఇంద్రియాల మీద పూర్తి పట్టు సాధించవచ్చు బ్రహ్మచారులు గాయత్రిని అర్థయుక్తంగా ఉపాసించి కొత్త జీవితాలను ఆవిష్కరిస్తారు

"గురువు మంత్రార్థమ్ము చెప్పుచు
ఉపనయన సంస్కార మందున
శిష్యునకు గాయత్రి మంత్రము
ప్రేమతోనుపదేశమొసగును" బృహద్గీత – 5 14 14

"లోకమున గాయత్రి నుపదే
శించెనన ఆచార్యవర్యుడు
బ్రహ్మచారికి ప్రాణరక్షణ
చేసినట్లుగ తలపవలయును" బృహద్గీత – 5 14 15

గాయత్రిని ఉపదేశించే పండితులు ఎంత దక్షిణ తీసుకొన్నప్పటికీ అది గాయత్రీ మంత్ర పాదానికి సమానం కాదని బృహదారణ్యకం పేర్కొంటున్నది మూడు లోకాలను పాలించగల్గిన సామర్థ్యం ఎవరికైనాలభిస్తే అది గాయత్రి మొదటి పాదాన్ని పొందినంత విలువ చేస్తుంది మూడు వేదాలకు సంబంధించిన పరిపూర్ణమైన జ్ఞానం ఎవరికైనాలభిస్తే అది రెండవ పాదాన్ని పొందినంత విలువ చేస్తుంది ప్రాణులనన్నింటిని తమ వశంలో నిలుపుకోగల్గిన శక్తి ఎవరికైనా లభిస్తే అది మూడవ పాదాన్ని ఆవిష్కరించినంత విలువ చేస్తుంది ఇట్టి దివ్యమైన గాయత్రీ మంత్రరహస్యాన్ని తెలుసుకొని ఎవరు పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తారో వారి కోరికలు సిద్ధిస్తాయి వారి చేత శత్రువులు నిర్జింపబడుతారు

జనకుడు అశ్వతరాశ్వుని కుమారుడైన బుడిలుని చూసి అతనితో "నువ్వు నీవు గాయత్రీ విదువిగా చెప్పుకొంటావు కదా! కాని, ఏనుగు బరువులు మోస్తున్నట్లు నీవు సంసారాన్ని మోస్తూ కష్టాలను అనుభవిస్తున్నావు. దానికి కారణం ఏమిటో చెప్పు" అని అడుగుతాడు. దానికతడు,

"చక్రవర్తీ! మీరు చెప్పిన
మాట నిజమే, నేను గాయ
త్రిని పఠింతును గాని దానికి
గల రహస్యము నెరుగజాలను"

బృహద్గీత — 5.14 30

అని సమాధానమిస్తాడు అప్పుడు జనకుడు బుడిలునికి గాయత్రీ మంత్రరహస్యాన్ని ఈ విధంగా చెబుతాడు.

"అగ్ని గాయత్రికి ముఖంబగు,
నెవడు దానిని గూర్చి మననము
సేయునో అతడీ జగమ్మున
అగ్ని ముఖుడై వెలుగుచుండును"

బృహద్గీత — 5.14 31

"ఎవడు గాయత్రీ ముఖుండై
వెలుగునో, పాపములనాతం
డగ్ని వలె భుజియించి శుద్ధుం
డగుచు నమరుండై వెలుంగును"

బృహద్గీత — 5.14 33

అగ్నిలో వేసిన ద్రవ్యం భస్మమైన విధంగా, గాయత్రీ మంత్ర ముఖుడైన మానవుని పాపాలు నశిస్తాయని చెప్పడం వల్ల గాయత్రి గురుమంత్రమనే విషయం తేటతెల్లమవుతుంది

## వాల్మీకిరామాయణం : బ్రహ్మచర్య పాలనం :

వాల్మీకి రామాయణం బ్రహ్మచర్య ప్రాశస్త్యాన్ని తెలుపుతున్న ఉత్తమకావ్యం లోకంలో ప్రశస్తమైన గుణగణాలు ఉన్నవాడు ఎవడని వాల్మీకి నారదుణ్ణి అడిగిన సందర్భాన్ని గమనిస్తే బ్రహ్మచర్య వైశిష్ట్యం బోధపడుతుంది

''కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్,
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః'' బాల, 1 2

మొదట వీర్యవంతుడెవడని అడిగిన తర్వాత ధర్మజ్ఞాది సద్గుణాలు కల్గిన వాడెవడని అడగడం వల్ల బ్రహ్మచర్యం అన్ని సుగుణాలకు మూలం అనే విషయాన్ని గుర్తించక తప్పదు చతుర్విధా శ్రమాలలో బ్రహ్మచర్యం మొదటిది బ్రహ్మచర్యాన్ని చిత్తశుద్ధితో పాటించినప్పుడే గృహస్థాది అశ్రమాలు విజయవంతమౌతాయి కేవలం బ్రహ్మచర్యం వల్లనే మానవులు వీర్యవంతులౌతారు

వాల్మీకి అడిగిన ప్రశ్నకు నారదుడిచ్చిన సమాధానం గమనించ దగింది

''ఇక్ష్వాకు వంశప్రభవో రామోనామజనైః శ్రుతః
నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ'' బాల, 1 8

ఇక్ష్వాకు వంశంలో జన్మించిన రాముడు నియతాత్ముడే కాక వీర్యవంతుడుగా పేర్కొనబడినాడు దీన్ని బట్టి బ్రహ్మచర్యం యొక్క ప్రాముఖ్యం ఏమిటో స్పష్టమవుతుంది అయోధ్యా నగర వాసులు సచ్ఛీలురుగా పేర్కొనబడినారు -

''సర్వే నరాశ్చ నార్యశ్చ ధర్మశీలాః సుసంయతాః,
ఉదితాః శీలవృత్తాభ్యాం మహర్షయ ఇవామలాః'' బాల, 6 9

అయోధ్యలోని స్త్రీ పురుషులెల్లరు ధర్మస్వభావం కల్గినవారు ఇంద్రియనిగ్రహం కల్గినవారు మంచి ప్రవర్తన కలిగి అభివృద్ధి పథంలో నడుస్తున్నవారు ఋషుల లాగా పాపం లేని వారు బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించడం చేతనే ఇలాంటి సద్గుణాలు వారి కలవడినాయని భావించవచ్చు

తాటకి మొదలైన రాక్షసులను సంహరించడానికి రాముణ్ణి తన వెంట పంపుమని విశ్వామిత్రుడు కోరినప్పుడు దశరథుడు మొదట సందేహించినాడు కాని కులగురువైన వశిష్ఠుని ఉపదేశం చేత వీర్యవంతులలో శ్రేష్ఠుడైన విశ్వామిత్రుని రక్షణలో రామునికెలాంటి కష్టం కలగదని గ్రహించి అందుకు అంగీకరించినాడు

''ఏష విగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాం వరః
ఏష బుద్ధ్యాధికో లోకే తపసశ్చ పరాయణమ్'' బాల, 21 10

రాముడు సత్యవాది ధనుర్ధారి పెద్దలంటే గౌరవం కల్గిన వాడు. జితేంద్రియుడు స్మితపూర్వాభిభాషి(మాట్లాడడానికి ముందు చిరునవ్వు నవ్వేవాడు) అన్ని వేళలా ధర్మాన్నే ఆశ్రయించినవాడు

''సత్యవాదీ మహేష్వాసో వృద్ధసేవీ జితేంద్రియః,
స్మితపూర్వాభిభాషీ చ ధర్మం సర్వాత్మనాశ్రితః'' అయోధ్యా, 2 41

ఇలాగే అనేక సందర్భాలలో రాముడు వీర్యవంతుడుగాను, జితేంద్రియుడుగాను చెప్పబడినాడు

రామాయణంలోని ఋష్యశృంగుని కథలో రెండు రకాల బ్రహ్మచర్యం పేర్కొనబడింది ఒకటి వ్రతిత్వం, రెండు ప్రాజాపత్యం వివాహ పూర్వ బ్రహ్మచర్యం వ్రతిత్వం, వివాహానంతర బ్రహ్మచర్యమే ప్రాజాపత్యం బ్రహ్మజ్ఞులచే కొనియాడదగిన ప్రసిద్ధమైన ఈ రెండు రకాల బ్రహ్మచర్యాన్ని ఋష్యశృంగుడు తన జీవితంలో అవలంబించినాడు ఋష్యశృంగుడు గొప్ప బ్రహ్మచారి అతడరణ్యంలో తన తండ్రి విభండకుని తప్ప మరే ఇతర పురుషుణ్ణి గాని స్త్రీని గాని చూసి ఎరుగడు ఆశ్రమం నుండి న్నడూ కాలు బయట పెట్టిన వాడు కూడా కాడు

''పితుః స నిత్యసన్తుష్టో నాతిచక్రామ చాశ్రమాత్,
న తేన జన్మప్రభృతి దృష్టపూర్వం తపస్వినా
స్త్రీ వా పుమాన్వా యచ్చాన్యత్సర్వం నగర రాష్ట్రజమ్'' బాల,10 8, 9

ఋష్యశృంగునికి బ్రహ్మచర్య పాలనచే అపారమైన శక్తి లభించింది అతడు అంగ దేశంలో ప్రవేశించగానే వర్షాలు పడి భూమి సస్యశ్యామలం అయింది మరో విశేషమేమంటే ఋష్యశృంగుని ఆధ్వర్యంలో దశరథుడు పుత్రేష్టిని జరిపి సంతానవంతుడయ్యాడు

బ్రహ్మచర్యమే నిజమైన తపస్సు జితేంద్రియుడు కానివాడు తపస్సుకు అనర్హుడు విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కావడానికి ఎంతో కాలం తపస్సు చేశాడు అతని తపస్సును అనగా బ్రహ్మచర్య దీక్షను భగ్నం చేయడానికి ఇంద్రాది దేవతలు ప్రయత్నించినారు రామాయణంలోని ఈ విశ్వామిత్రుని కథ బ్రహ్మచర్యాన్ని తపస్సుగా పాటించాలనుకున్న వారికి గొప్ప సందేశాన్ని ఇస్తుంది

ఎంతో కాలం ఇంద్రియాలను నిగ్రహించుకొని తపస్సును కొనసాగించిన విశ్వామిత్రుడు ఋషి వాచ్యుడయ్యాడు కాని అంతలోనే మేనక సౌందర్యానికి ఆకర్షితుడై బ్రహ్మచర్యదీక్షను భంగపరుచుకొన్నాడు కొంతకాలం గడచిన తర్వాత జ్ఞానోదయం కల్గి హిమాలయాల్లో తపస్సు చేశాడు ఇంద్రియాలను జయించాడు మహర్షి అయ్యాడు కాని బ్రహ్మర్షి కావాలన్న పట్టుదల తో ఘోర తపస్సు చేశాడు గ్రీష్మంలో పంచాగ్నుల మధ్య ఉండి, వర్షాకాలంలో ఆరుబయట ఉండి, చలికాలంలో రేయింబవళ్ళు నీళ్లలోనే ఉండి తపస్సును కొనసాగించాడు కాని ఇంద్రియాలు ఎదురు తిరిగాయి ఈసారి రంభ విశ్వామిత్రుని బ్రహ్మచర్య దీక్షకు పరీక్ష పెట్టింది విశ్వామిత్రుడు కోపం పట్టలేక రంభను రాతి బండ కమ్మని శపించాడు మళ్లీ తపస్సుకు భగ్నం ఏర్పడింది కాని విశ్వామిత్రుడు మరింత నిష్ఠతో బ్రహ్మచర్యాన్ని అవలంబించాడు మౌనవ్రతుడై తపస్సు చేశాడు ఆహారాన్ని కూడా పరిత్యజించడంతో అతని శరీరం ఎండిన కట్టెలా మారిపోయింది తిరిగి అతడు అన్నం తినడానికి సిద్ధమయ్యాడు కాని ఇంద్రుడు బ్రాహ్మణవేషంలో వచ్చి అన్నాన్ని తన కిమ్మనికోరినాడు విశ్వామిత్రుడివ్వగా దాన్ని ఆరగించాడు విశ్వామిత్రుడంతటితో ఆగక తపస్సును ఉధృతం చేశాడు మూడులోకాలు దహింపబడినంత పని అయ్యింది

చివరికి అతని తపస్సు ఫలించింది కఠినమైన బ్రహ్మచర్యదీక్షవల్ల మహాత్ముడైన విశ్వామిత్రుణ్ణి ఓంకార వషట్కారాలు, వేదాలు సంపూర్ణంగా వరించాయి యజ్ఞయా గాదులు చేయించే అధికారంతో పాటు శిష్యులకు వేదార్థాన్ని ప్రబోధించే అర్హత కూడా లభించింది దానితో అతడు లోకమంతా సంచరించి వేద ధర్మాన్ని ప్రచారం చేశాడు

"కృతకామో మహీం సర్వాం చచార తపసి స్థితః" బాల, 65 27

అన్న రామాయణ వాక్యం అందుకు ప్రమాణం

ఇట్టి మహోన్నత వ్యక్తిత్వం కల్గిన విశ్వామిత్రుణ్ణి విద్వాంసులు వేదమంత్రార్థం తెలిసిన ఋషిగా గౌరవిస్తారేతప్ప సత్య హరిశ్చంద్రుణ్ణి కష్టాలపాలు చేసిన మోసగానిగా చూడరు ఒక్క వాల్మీకి రామాయణంలో తప్ప తక్కిన పురాణాల్లోను, కావ్యాల్లోను విశ్వామిత్ర మహర్షికి అన్యాయమే జరిగింది వాల్మీకి ఋషి కాబట్టి ఋషి అయిన విశ్వామిత్రుని గొప్పతనాన్ని చక్కగా గుర్తించ గలిగాడు రామాయణంలో అతని వ్యక్తిత్వాన్ని మహోన్నతంగా, ఆదర్శంగా చిత్రించ గలిగాడు

శతానందుడు రామలక్ష్మణులతో జనకుని సమక్షంలో విశ్వామిత్రుని గూర్చి పల్కిన పల్కులు అతని బ్రహ్మచర్యదీక్షను మనకు తెలియజేస్తాయి

"ఏష రామ ! మునిశ్రేష్ఠ ఏషవిగ్రహవాం స్తపః,
ఏష ధర్మపరో నిత్యం వీర్యస్యైష పరాయణమ్" బాల, 65 28

ఓ రామ ! విశ్వామిత్రుడు మునులలో శ్రేష్ఠుడు మూర్తీభవించిన తపస్సు ధర్మం పట్ల ఆసక్తి గలవాడు వీర్యానికి నివాస స్థానం ఈ మాటలు చాలు లోకంలో విశ్వామిత్రుని స్థానం ఏమిటో తెలుసుకోవడానికి

రాముడు సీతను వివాహమాడడానికి అతని బ్రహ్మచర్యమే ప్రధాన కారణమని తెలిస్తే ఆశ్చర్యం కలుగుతుంది రాముడు ధనుర్భంగం చేసి సీతను వివాహమాడిన ఘట్టాన్ని ఔచిత్య శోభితంగా వాల్మీకి నడిపించాడు సీతను వివాహమాడడానికి అంతకు ముందే ఎంతోమంది రాజులు జనకుని దగ్గరికి వచ్చి అర్థించారు జనకుడు వారితో సీత వీర్యశుల్క అని చెప్పడం జరిగింది

"తేషాం వరమతాం కన్యాం సర్వేషాం పృథివీక్షితామ్,
వీర్యశుల్కేతి భగవన్ నదదామి సుతామహం" బాల, 66.16

వీర్యశుల్క అన్న మాటకు దార్శనిక జ్ఞానంలేని వారు ఇచ్చే అర్థం పరాక్రమమే శుల్కంగా కల్గింది అని కాని దీని అర్థం బ్రహ్మచర్యమే శుల్కంగా కల్గింది అని జనకుడు వేదజ్ఞుడు శాస్త్రప్రకారం నడిచేవాడు బ్రహ్మచారిణి అయిన సీతను బ్రహ్మచారికి మాత్రమే ఇస్తాడు తప్ప కేవలం దేహబలం కల్గినవానికి మాత్రం కాదు ఆమెను వరించేవాడు ఆమెకు గుణస్వభావాలలో సమానుడు కావాలి అన్నింటికి మించి బ్రహ్మచర్యసంపద కల్గినవాడు కావాలి కేవలం రాజు కాని, కేవలం ఐశ్వర్య శాలికాని, కేవలం పరాక్రమం కల్గినవాడు కాని కాడు

బ్రహ్మచారి ముఖంలో దివ్యమైన తేజస్సు కనిపిస్తుంది ఇది ఓజస్సు వల్ల ఏర్పడుతుంది ఓజస్సుకు కారణం వీర్యమే బ్రహ్మచారి మాత్రమే వీర్యాన్ని రక్షించుకోగలుగుతాడు అటువంటి బ్రహ్మచారికే జనకుడు సీతను ఈయ దలచాడు కాని అనేక మంది రాజులు పెళ్లైన వారు కూడా ఈ విషయం తెలియక సీతను వివాహ మాడడానికి ముందుకు వచ్చారు తమ బలాన్ని పరీక్షింప దలచినారు జనకుడు వారికి శివధనుస్సును చూపినాడు కాని ఏం లాభం ? వారెవరూ దాన్ని కదల్ప లేక పోయినారు ఆ కారణంగా జనకుడు వారి బలం అల్పమైందిగా నిర్ధారించినాడు ఎప్పుడైతే తమ బలహీనత బయట పడిందో అప్పుడు రాజులు మిథిలను ముట్టడించారు కాని శక్తి శాలి ఐన జనకుడు వారితో యుద్ధం చేసి పారద్రోలినాడు ఇదంతా రాముడు శివధనుస్సును విరిచి సీతను పెళ్లిచేసుకోవడానికి ముందు జరిగిన కథ

> ''తతో భగ్నా నృపతయో హన్యమానా దిశోయయుః,
> అవీర్యా వీర్యసన్దిగ్ధాః సామాత్యాః పాపకర్మణః'' బాల, 66 24

వీర్యవంతులు కాని వారు, వీర్యం విషయంలో సందేహం కల్గినవారు, పాపకర్ములు జనకుని చేతిలో ఓడిపోయినారు.

ఇక్కడ ఒక విషయం గమనించాలి వీర్యాన్ని రక్షించకోలేనివారు, వీర్యరక్షణ విషయంలో సందేహం ఉన్న వారు పాపకర్ములేనన్న విషయం మరవరానిది బ్రహ్మచర్యాన్ని పాటించే వారికే వీర్యం యొక్క పరమ ప్రయోజనమేమిటో తెలుస్తుంది

బ్రహ్మచర్యం సిద్ధించిన వారికి గొప్ప సామర్థ్యం కల్గుతుంది ఎవరు వీర్యాన్ని రక్షించు కొంటారో వారు పుణ్యాత్ములు అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం – ఈ ఐదూ పుణ్యకర్మలు వీటిలో ఒకటైన బ్రహ్మచర్యం అనే పుణ్యకర్మను ఎవరు పాటించరో వారు పాపాత్ములేకదా

రాముడు బ్రహ్మచర్యవ్రతాన్ని చక్కగా పాటించి అపారమైన సామర్థ్యాన్ని సంపాదించినాడనడానికి ఉదాహరణ అతడు కేవలం నారిని సవరించి శివుని వింటిని భగ్నం చేయడమే ఆవిధంగా రామచంద్రుని విషయంలో బ్రహ్మచర్య ప్రభావం లోకానికి తెలిసిపోయింది రాముడెంతటి వీర్యవంతుడో జనకుడు ప్రత్యక్షంగా చూసినాడు అది అతనికి అద్భుతమైందే కాదు, ఊహకందనిది ఇదే విషయాన్ని విశ్వామిత్రునితో చెప్పినాడు

“భగవన్ దృష్టవీర్యో మే రామో దశరథాత్మజః,
అత్యద్భుతమచింత్యంచ నతర్కితమిదం మయా” బాల, 67 21

సీతను వివాహమాడడానికి వీర్యమే శుల్కమని తాను మొదట చేసిన ప్రతిజ్ఞ నెరవేరినందుకూ, రాముని వివాహమాడి సీత తన వంశానికి ఎంతో కీర్తి తెచ్చినందుకూ జనకుడు చాల సంతోషించినాడు

“మమ సత్యా ప్రతిజ్ఞాచ వీర్య శుల్కేతి కౌశిక,
సీతా ప్రాణైర్బహుమతా దేయా రామాయ మే సుతా” బాల, 67 23

రాముడు శివధనుర్భంగం చేసి తన సామర్థ్యాన్ని నిరూపించుకొన్నాడు బ్రహ్మచర్యాది సద్గుణాలతో లోకానికి ఆదర్శప్రాయుడైనాడు వాల్మీకి దృష్టిలో రాముడు పరిపూర్ణమైన మానవుడు లోకోత్తరమైన చరిత్ర కల్గిన వాడు వాల్మీకి రాముణ్ణి ఉత్తముడైన మానవునిగా చిత్రించినాడే తప్ప దేవునిగా ఎక్కడా చెప్పలేదు రాముడు రాగద్వేషాలకు అతీతుడేమికాడు అయినప్పటికీ దేన్ని ఇష్టపడాలో, దేన్ని ద్వేషించాలో, ఏ సమయంలో ఎలా వ్యవహరించాలో తెలిసిన విద్వాంసుడు పితృవాక్య పరిపాలకుడు ఏక పత్నీవ్రతుడు ప్రజారంజకుడైన మహారాజా కష్టాలను సహించడంలో అతనికతడే సాటి తన ధీరోదాత్తాది సద్గుణాలచేత ఎన్ని యుగాలనైనా ప్రభావితం చేయగలిగిన రాముణ్ణి ఆదర్శమానవునిగా తీసుకోవడం మన కర్తవ్యం. కాని భక్త్యావేశపరులు రాముణ్ణి దేవుణ్ణి చేశారు వేదవేదాంగవేత్త ఐన హనుమంతుణ్ణి కోతిని చేశారు

హనుమంతుడు వానరుడు (వననరుడు) కాని కోతి మాత్రం కాడు సుగ్రీవుని మంత్రిగా, రామునికిష్టపాత్రుడైన బంటుగా, బ్రహ్మచర్యాది సద్గుణ సంపన్నుడుగా అతని చరిత్రను వాల్మీకి బహుసుందరంగా రామాయణంలో వర్ణించినాడు వాఙ్మనః శరీరాలతో నిర్మింపబడినవాడు మానవుడు శుద్ధమైన వాక్కు, అలోచింప గలిగిన మనస్సు, ధర్మకార్యాలు చేయగల్గిన శరీరం హనుమంతునికున్నప్పుడు అతడు మానవుడు కాక కోతి ఎలా అవుతాడు ? వానర రాజా వాలి వాలి రాజ్యం కిష్కింధ అతని బల పరాక్రమాలు మనకు తెలియనివి కావు సుగ్రీవాదుల వ్యవహారాలు మానవానుకూలమైనవే అంగదుని రాయబారం ప్రశస్తమైంది అన్నిటికి మించి హనువమంతుని బ్రహ్మచర్యం, బలపరా క్రవమాలు లోకోత్తరమైనవి

హనుమంతుడు అరణ్యంలో సంచరిస్తున్న రామలక్ష్మణుల దగ్గరికి సుగ్రీవుడు పంపగా వచ్చి మొదటి పరిచయంలోనే ఆ అన్నదమ్ములను ఎంతగానో ఆకట్టుకొన్నాడు ముఖ్యంగా రాముణ్ణి ముగ్ధుణ్ణి జేసినాడు

''నానృగ్వేద వినీతస్య నాయజార్వేద ధారిణః,
నా సామ వేద విదుషః శక్యమేవం విభాషితుమ్ ''   కిష్కింధా, 3 28

ఋగ్వేదం, యజార్వేదం, సామవేదం చదవని వాడు ఇంత చక్కగా మాట్లాడడని రాముడే స్వయంగా చెప్పడం వల్ల హనుమంతుడు వేదాధ్యయనపరుడనే విషయం స్పష్టవౌతుంది అంతేకాదు అతడు శిక్ష, వ్యాకరణాది వేదాంగాలను కూడా అభ్యసించినాడు ముఖ్యంగా వ్యాకరణాన్ని అనేక పర్యాయాలు చదివినాడు అందుచేతనే అతని మాటలలో చిన్న తప్పుకూడా దొర్లడం లేదని రాముడు ప్రశంసించినాడు

''నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్,
బహు వ్యాహరతానేన న కించిదపశబ్ధితమ్ ''   కిష్కింధా, 3 29

హనుమంతుడు ఆజన్మ బ్రహ్మచారి అని రాముని మాటల వల్ల తెలుసుకోవచ్చు

''న ముఖే నేత్రయోశ్చాపి లలాటే చ భ్రువోస్తథా,
అన్యేష్వపిచ సర్వేషు దోషః సంవిదితః క్వచిత్ ''   కిష్కింధా, 3 30

హనుమంతుని ముఖంలో గాని, నేత్రంలోగాని, లలాటంలో గాని, కనుబొమలలోగాని మరే అవయవంలో గాని ఏమాత్రం దోషం కనిపించడం లేదని చెప్పడం వల్ల అతడు గొప్ప తేజస్సంపన్నుడనే విషయం స్పష్టమవుతుంది బ్రహ్మచారుల జీవితంలో మాత్రమే ఈ లక్షణాలు గోచరిస్తాయి

హనుమంతుని వచోనైపుణ్యాన్ని రాముడు వేనోళ్ల పొగడినాడు అతని మాటలలో అనవసరమైన పొడిగింపులేదు సందేహానికి తావు లేదు ఉచ్చారణలో ఆలస్యం లేదు వినడానికి కటువుగా ఉండి బాధ కల్గించడం లేదు వాక్కు నాభినుండి పైకి వచ్చేటప్పుడు ముందుగా మధ్యమా వాగ్రూపంలో వక్షస్థలాన్ని తాకుతూ క్రమంగా శ్రోతలకు వినబడే వైఖరీ రూపంలో కంఠాన్ని చేరుతుంది అది మధ్యమ స్వరంలో ఉండి అందరిని అలరిస్తుంది రాముడు హనుమంతుని పలుకులను గూర్చి విజయ పత్రం (Certificate) ఇచ్చి నాడని చెప్పవచ్చు

''అవిస్తరమసందిగ్ధ మవిలంబితమవ్యథమ్,
ఉరఃస్థం కణ్ఠగం వాక్యం వర్తతే మధ్యమస్వరమ్'' కిష్కింధా, 3 31

ఇంకా చెప్పాలంటే హనుమంతుడు ఉచ్చరించే ప్రతిమాట వ్యాకరణంచేత సంస్కరింపబడింది అద్భుతమైంది ఉచ్చారణలో తొందరలేనిది అన్నిటిని మించి మంగళ ˇదమైంది హృదయాన్ని లోబరచుకోగలిగింది

''సంస్కారక్రమసంపన్నామద్భుతామవిలంబితామ్,
ఉచ్చారయతి కళ్యాణీం వాచం హృదయహారిణీమ్'' కిష్కింధా, 3 3

వేద ఋక్కులు కళ్యాణ ప్రదమైనవి ఋక్కులను ఉచ్చరింపగల్గిన హనుమంతుడు మాట్లాడుతుంటే ఎవరి మనస్సైనా వెంటనే కరిగిపోతుంది కత్తి ఎత్తిన శత్రువు మనస్సుకూడా మారిపోయే శక్తి అతని సూక్తిలో ఉందంటాడు రాముడు

''అనయా చిత్రయా వాచా త్రిస్థావ్యంజనస్థయా,
కస్య నారాధ్యతే చిత్తముద్యతాసే రరేరపి'' కిష్కింధా, 3 33

వర్ణోచ్చారణ స్థానాలలో ముఖ్యమైనవి వక్షస్థలం, కంఠం, శిరస్సు ఈ మూడు స్థానాలను ఉపయోగించుకొని వెల్వడే వాక్కు ఎలాంటి వారినైనా ఆకట్టుకుంటుందని రాముని అభిప్రాయం.

వేదాధ్యయనం బ్రహ్మచర్యమే అవుతుంది హనుమంతుడు వేదాధ్యయన పరంగానే కాక వీర్యరక్షణ పరంగానూ ఉత్తమ బ్రహ్మచారి అతనిది ఆదిత్య బ్రహ్మచర్యం

## బ్రహ్మచర్యం – వీర్యరక్షణ :

"మరణం బిందుపాతేన, జీవనం బిందుధారణాత్" అన్న ఆర్యోక్తిని మరవరాదు వీర్యనాశనం మృత్యుకారణమైతే, వీర్యరక్షణ సుఖమయ జీవనానికి హేతువవుతుంది

మనుష్య శరీరంలోని సారానికే వీర్యం అని పేరు ఇట్టి వీర్యాన్ని శరీరంలో ఎప్పటికప్పుడు ఇమిడించుకోవడం కష్టసాధ్యం యోగుల కన్నులను, ఋషుల ముఖాలను, బ్రహ్మచారుల దినచర్యను గమనించినప్పుడు వీర్యరక్షణకై వారు చేసే ప్రయత్నాలు ఎలాంటివో తెలుస్తాయి విద్వాంసులు వీర్యరక్షణను జీవితధ్యేయంగా భావిస్తారు వీర్యనాశం వల్ల కలిగే ఉపద్రవాలను గుర్తించినప్పుడు ప్రతిఒక్కరు వీర్యరక్షణ విషయంలో జాగరూకత వహించే అవకాశం ఉంది ఇట్టి వీర్యం ఏర్పడే విధానాన్ని తెలుసుకొందాం



"రసాద్రక్తం తతోమాంసం మాంసాన్మేదః ప్రజాయతే
మేదసో ఽస్థిః స్తతోమజ్జా మజ్జః శుక్రంతు జాయతే"



సుశ్రుత సూత్రమ్ – 14 13

మనం భుజించిన ఆహారం జీర్ణమై రసంగా మారుతుంది రసం నుండి రక్తం, రక్తంనుండి మాంసం, మాంసం నుండి మేదస్సు (కొవ్వు), మేదస్సు నుండి ఎముక, ఎముక నుండి మజ్జ, మజ్జ నుండి శుక్రం ఏర్పడుతుంది పురుషవీర్యం శుక్రం అనీ, స్త్రీ వీర్యం రజస్సు అనీ చెప్పబడుతాయి కొద్ది వీర్యం ఏర్పడడానికి ఎంతో రక్తం అవసరమౌతుంది డా॥ కోవెన్ అనే పాశ్చాత్య తత్త్వవేత్త "The Science of New Life" అనే పుస్తకంలో శరీరంలోని ఏ భాగం నుండైనా నలభై ఔన్స్‌ల రక్తాన్ని తీసినట్లయితే అది ఒక ఔన్స్ వీర్యంతో సమానం అవుతుందని అభిప్రాయ పడ్డాడు కాని కొంతమంది అభిప్రాయం ప్రకారం ఒక ఔన్స్ వీర్యం ఏర్పడడానికి అరవై ఔన్స్‌ల రక్తం అవసరమౌతుంది రక్తంలో మనిషిని జీవింపజేసే లేదా మరణింపజేసే శక్తి ఉన్నప్పుడు రక్తసారమైన వీర్యంలోను

ఇట్టి శక్తి ఎక్కువగానే ఉంటుందని చెప్పవచ్చు భారతీయ ఆయుర్వేదాన్ని అనుసరించి ఆహారం నుండి వీర్యం ఏర్పడడానికి ఏడుదశలున్నట్లు తెలుస్తుంది

ఆహారం జీర్ణమై రసధాతువుగా మారడం మొదటి దశ

రసం నుండి రక్తం ఏర్పడడం రెండవ దశ

రక్తం నుండి మాంసం ఏర్పడడం మూడవ దశ

మాంసం నుండి కొవ్వు ఏర్పడడం నాల్గవ దశ

కొవ్వు నుండి ఎముక ఏర్పడడం ఐదవ దశ

ఎముక నుండి మజ్జ ఏర్పడడం ఆరవ దశ

మజ్జ నుండి వీర్యం ఏర్పడడం ఏడవ దశ

ఒక ధాతువు నుండి మరొకధాతువు నిర్మితం కావడానికి ఐదు దినాలు పడతాయి రసధాతువునుండి రక్తం ఏర్పడే సమయంలోని సారహీనభాగం కఫంగాను, రక్తం లోని సారహీనభాగం పిత్తంగాను, మాంసంలోని సారహీనభాగం చెవి, ముఖం మొదలైనవాటి లోని గులిమి, పాచిగాను, కొవ్వులోని సారహీనభాగం చెమటగాను, ఎముకలోని సారహీనభాగం గోళ్ళు, వెంట్రుకలుగాను, మజ్జలోని సారహీనభాగం కండ్లపులుసు, చర్మంమీది తైలంగాను ఏర్పడుతాయని సుశ్రుత సూత్రాలు తెలుపుతున్నాయి

క్రూడాయిలు నుండి పెట్రోలు ఏర్పడినప్పుడు రకరకాల పదార్థాలు ఉత్పన్నమై రకరకాల ప్రయోజనాలను కూర్చడం చూస్తున్నాం కదా అట్లే అన్నసారం వివిధ ధాతువులుగా పరిణతి చెంది శరీరంలోని ఆయా ధాతువులను పోషిస్తూ, శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుతుంది. ఈ పరిణామ క్రమంలోని మల రహితమైన శుద్ధ పదార్థమే వీర్యం

వీర్యాన్ని రక్షించుకోవడం వల్ల శరీరంలో అద్భుతమైన శక్తి జనిస్తుంది ఈ శక్తినే వైద్య శిఖామణి ధన్వంతరి ఓజస్సు అని పిలిచాడు యజ్ఞానంతర ప్రార్థనలో "ఓమ్ ఓజోసి ఓజోమయి ధేహి" అని పరమేశ్వరుణ్ణి ప్రార్థించడం గమనార్హం ఈ ఓజో గుణమే మానవునికి ఆత్మ దర్శనాన్ని కలిగించడంలో సహాయకారి అవుతుంది ఏ వ్యక్తి ముఖంలో తేజస్సు,

మాటలలో గాంభీర్యం, నడవడిలో ఉత్సాహం చోటుచేసుకుంటాయో ఆ వ్యక్తి బ్రహ్మచర్యాన్ని పాటిస్తున్నాడని ఊహించవచ్చు

మనస్సులో కామసంబంధితమైన కోరికలు కలిగినప్పుడు శరీరంలో మధనం పుట్టి అండకోశాలద్వారా వీర్యం బహిర్గతవౌతుంది భావప్రకాశకర్త ఈ విషయాన్ని ఆలంకారికంగా తెలిపినాడు

"యథా పయసి సర్పిస్తు గూఢశ్చేక్షౌ యథారసః,
ఏవం హి సకలే కాయే శుక్రం తిష్ఠతి దేహినామ్'' - 240

ఏ విధంగానైతే పాలను చిలకడంద్వారా నెయ్యి, చెఱకును గానుగ పట్టడం ద్వారా రసం బహిర్గతమౌతాయో దేహమధనం వల్ల వీర్యం బహిర్గతమౌతుందని ఈ శ్లోకం యొక్క భావం ఈ విధంగా వీర్యం యొక్క స్థానం ఆయుర్వేదాన్ని అనుసరించి సంపూర్ణశరీరమే కాని పాశ్చాత్యులు మనవారి లాగా వీర్యాన్ని ఏడు ధాతువుల సారంగానూ, వీర్యం యొక్కస్థానాన్ని సంపూర్ణ శరీరంగానూ గుర్తించలేదు మనోవికారాల వల్ల అండకోశాలు పని చేసి వీర్యాన్ని ఉత్పన్నం చేస్తాయని మాత్రమే ఊహించారు

వాగ్భటుడు అనే ఆలంకారికుడు ఓజస్సును ఈ విధంగా వర్ణించినాడు

''ఓజశ్చ తేజోధాతూనాం శుక్రాన్తానాం పరం స్మృతమ్
హృదయస్థమపి వ్యాపి దేహస్థితి బంధనమ్
యస్యప్రవృద్ధే దేహస్య తుష్టిపుష్టి ఫలోదయాః
యన్నాశో నియతో నాశోయస్మిన్ తిష్ఠతి జీవనమ్
నిష్పద్యన్తే యతోభావా వివిధ దేహ సంశ్రయాః
ఉత్సాహ-ప్రతిభా-ధైర్య-లావణ్య-సుకుమారతాః ''

ఓజస్సు శరీరం అంతటా వ్యాపించి ఉంటుంది ఇది దేహం యొక్క ఉనికికి కారణభూతమైంది ఓజస్సు వల్ల తుష్టి పుష్టి ఉత్పన్నమవుతాయి ఒకవేళ ఓజస్సే నష్టమైతే అవికూడా నష్టమౌతాయి ఓజస్సు వల్ల ఉత్సాహం, ప్రతిభాశక్తి జనిస్తాయి ధైర్యం, లావణ్యం,

సౌకుమార్యం మొదలైన భావాలు ప్రకటితం కావడానికి కూడా ఓజస్సే కారణమని వాగ్భటుని అభిప్రాయం

భావ ప్రకాశకర్త వీర్యం యొక్క గొప్పతనాన్ని ఈ విధంగా ఉల్లేఖించినాడు

శుక్రం సౌమ్యం సితం స్నిగ్ధం బలపుష్టికరమ్ స్మృతమ్,
గర్భబీజం వపుఃసారో జీవస్యాశ్రయ ఉత్తమః"

వీర్యం సారభూతమైందిగా, తెల్లనిదిగా, స్నిగ్ధమైందిగా, బలకరమైందిగా, పుష్టి కరమైందిగా, గర్భబీజంగా, శరీరం యొక్క సారంగా, ప్రాణి కోటి ఆశ్రయింపదగిన ఉత్తమ రూపంగా పేర్కొన బడడం వల్ల దాని ప్రత్యేకత తెలుస్తుంది

వీర్యం రక్తం నుండి ఉత్పన్నమౌతుందన్న ప్రచారం కారణంగా పౌష్టికాహారంతో వీర్యనష్టాన్ని భర్తీ చేసుకోవచ్చుననే తప్పుడు అభిప్రాయం ఒకటి ఉంది కాని అది సరికాదు. యధార్థానికి వీర్యకణాల ఉత్పత్తి మస్తిష్కం నుండి జరుగుతుంది అన్యద్రవ్యాలతో కలిసి అండకోశాలలో బహిః స్రావరూపంలో ప్రకటితమవుతుంది మస్తిష్కం లో ఉత్పన్నమైన శుక్రకణం దాని నుండి విడివడినప్పుడు అంతే అంశాన్ని మస్తిష్కం కోల్పోయినట్లు నిర్ణయించ వలసి ఉంటుంది వీర్యకణాలను ఒకవేళ సంతానోత్పత్తి కొరకే ఉపయోగించి నట్లైతే మానవుని శారీరక, మానసిక శక్తులు నష్టం కాకుండా రక్షింపబడుతాయి.

ఉత్పాదక పదార్థాలను మితిమీరి ఉపయోగించి నట్లైతే లేదా ప్రకృతి నియమాలను ఉల్లంఘించి వాడుకొన్నట్లైతే మస్తిష్కం మీద అత్యాచారం జరిగినట్లు భావించ వలసి ఉంటుంది వీర్యకణాలకు ఉత్పత్తి స్థానమైన మెదడును బలహీనం చేయడం వల్ల శరీరానికి అనేక రోగాలు సంక్రమిస్తాయి. వీర్యకణాలకు, మెదడుకు సన్నిహిత సంబంధం ఉంది వీర్యం నశించినట్లైతే దాని ప్రభావం మెదడు మీద ఉంటుంది మన శరీరంలో నలభైరోజాలకు గాను సుమారు పదిహేనుగ్రాముల వీర్యం ఏర్పడుతుంది ఒక్కసారి మైథునక్రియ జరపడం వల్ల అది పూర్తిగా నష్టమవుతుంది. అనగా నలభై రోజుల్లో సంపాదించిన వీర్యాన్ని ఒక్క నిమిషంలో పోగొట్టు కుంటున్నామన్నమాట !

పాశ్చాత్య వైజ్ఞానికుల పరిశోధనలు కూడా ఈ విషయాన్నే ధ్రువపరుస్తున్నాయి

ఉదాహరణకు వృక్షసౌందర్యాన్ని రక్షించడానికి దాని ఫలోత్పాదన సమయాన్ని పెంచడం అవసరం విత్తనాలు ఏర్పడేదాకా చెట్లు పూలతో అందంగా ఉంటాయి పూలలో బీజం ఏర్పడే సమయాన్ని ఆలస్యం చేస్తే పూలు మొదటికంటె ఎక్కువ కాలం విచ్చుకొని ఉంటాయి వీర్యనష్టం కాకుండా ఆపబడిన కీటకాలు ఇతర కీటకాల కంటె ఎక్కువ కాలం జీవించినట్లు పరిశోధనల వల్ల తేలింది సీతాకోక చిలుకలను పరీక్షించినప్పుడు జనన శక్తిని ఉపయోగించిన వాటికంటె ఉపయోగించనివి రెండు మూడేండ్ల కాలం ఎక్కువగా జీవించినట్లు నిరూపింపబడింది

ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొని చూసినప్పుడు జీవిత రక్షణకు వీర్యరక్షణ ఎంతో అవసరమని తెలుస్తుంది

## బ్రహ్మచర్యం - ఇంద్రియనిగ్రహం :

జీవిత పర్యంతం బ్రహ్మచర్యాన్ని పాటించిన వారిని ఊర్ధ్వరేతస్కులని, ఆదిత్యబ్రహ్మచారులని పిలుస్తారు వీర్యస్ఖలనానికి పూర్తి దూరంగా ఉన్నవారే ఆదిత్య బ్రహ్మచారులు ఆదిత్య బ్రహ్మచర్యం సామాన్యులకు సాధ్యం కాదు దీన్ని దృష్టిలో పెట్టుకొని పురుషులకు 25 ఏండ్లు, స్త్రీలకు 16 ఏండ్లు వివాహపు వయసుగా పూర్వ కాలంలో నిర్ణయింప బడింది కేవలం 25 ఏండ్ల ప్రాయం వరకు గడిపిన బ్రహ్మచర్యం సామాన్యమైందే దాన్ని పెద్ద ఆదర్శంగా గ్రహించవలసిన పని కూడా లేదు. అఖండశక్తిభండారమైన పరమేశ్వరుని అన్వేషణలో జీవితాన్ని గడపాలనుకొన్న వారికి కేవలం 25 ఏండ్ల బ్రహ్మచర్యం సరిపోదు అందుకు ఆజన్మ బ్రహ్మచారులుగా ఉండడమే తగిన పద్ధతి శిష్యుల నడవడిని చక్కదిద్దడమే ముఖ్యోద్దేశంగా కలిగిన గురువులు అస్ఖలిత బ్రహ్మచర్యాన్ని అవలంబించినారు వారు నిద్రలో గాని, జాగరణలో గాని, స్వాభావికంగా గాని, బలవంతంగా గాని వీర్యాన్ని నశింప జేసుకోవడం పాపంగా భావించినారు

బ్రహ్మచర్యం పాటించి, దాని ప్రభావంచేత మహత్కార్యాలు చేసిన మహనీయుల జీవితచరిత్రల నెన్నింటినో మనం చదువుకొని ఉన్నాం శ్రీరాముడు బ్రహ్మచర్య పాలన చేతనే శివధనుస్సు విరిచి జానకిని పెళ్లాడినాడు మహా బలసంపన్నులైన రావణ కుంభకర్ణులను సంహరించినాడు లక్ష్మణుడు బ్రహ్మచర్య ప్రభావంచేతనే మేఘనాథాది వీరులను

హతమార్చినాడు హనుమంతుడు కాలనేమిలాంటి రాక్షస వీరులను మట్టుపెట్టడానికి ఈ బ్రహ్మచర్యమే తోడ్పడింది శ్రీ కృష్ణుడు బ్రహ్మచర్యదీక్ష చేతనే మల్లయుద్ధ ప్రవీణులైన చాణూరముష్టికుల మదాన్నిఅణచి, కంసుని సంహరించ గలిగినాడు భీముడు వీర్యలాభం చేతనే బక, జరాసంధ, కీచక, దుర్యోధనాది వీరులను చంపినాడు అర్జునుడు బ్రహ్మచర్య వ్రతం చేతనే కౌరవులను జయించ గలిగి నాడు భీష్ముని ఆజన్మ బ్రహ్మచర్య వ్రతం లోకప్రసిద్ధమైందే కదా !

ఆర్యసమాజ స్థాపకుడు, వేదోద్ధారకుడైన మహర్షి దయానంద సరస్వతి బ్రహ్మచర్య దీక్ష జగద్విదితం ఆయన బ్రహ్మచర్యాన్ని జీవితాంతం అసిధారావ్రతంగా పాటించి అనేక విజయాలు సాధించిన ధీరుడు వీర్యరక్షణతో పాటు వేదాధ్యయన పరుడై బ్రహ్మజ్ఞానాన్ని సంపాదించి, సమాధి స్థితిలో ఈశ్వర సాక్షాత్కారాన్ని పొందిన యోగివర్యుడు వేగంగా పరిగెత్తుతున్న పెద్ద జట్కాబండిని ఒక్క చేత్తో పట్టుకొని ఆప గల్గిన ధీశాలి బురదలో ఇరుక్కొని పోయిన బండిని, ఎడ్లను తొలగించి ఒక్కడే బయటకు అవలీలగా లాగిన శక్తిశాలి

బ్రహ్మచర్యం యొక్క అర్థం పెళ్లి చేసుకోకుండా ఉండడం కాదు బాల్యంలో బ్రహ్మచర్యాన్ని పాటించి వేదాది విద్యలను అభ్యసించడం, పూర్ణయౌవనాన్ని సాధించి గుణకర్మ స్వభావాలకనుగుణంగా ఉండి బ్రహ్మచర్యాన్ని పాటిస్తున్న కన్యను వివాహ మాడడం వైదిక పద్ధతి ఈ పద్ధతిని అనుసరించి ఏకపత్నీవ్రతులై సంతానాన్ని పొందిన గృహస్థులెందరో ఉన్నారు పరస్త్రీని తల్లిగా, చెల్లిగా, కూతురుగా చూస్తూ ఏక పత్నీవ్రతులై గృహస్థాశ్రమ ధర్మాన్ని పాటిస్తున్న వారు బ్రహ్మచారులే ఇదే నియమం స్త్రీలకూ వర్తిస్తుంది వారు పరపురుషుణ్ణి తండ్రిగా, సోదరునిగా, కుమారునిగా భావించి కర్తవ్యపాలన చేయాలి కేవలం సంతానార్థమై ఏర్పడే స్త్రీ పురుష వైవాహిక సంబంధం కూడా బ్రహ్మచర్యమే 25 సంవత్సరాలుబ్రహ్మచర్యాన్ని పాటించిన పురుషునికి 16 సంవత్సరాలు బ్రహ్మచర్యాన్ని పాటించిన కన్యతో, 32 సంవత్సరాలు బ్రహ్మచర్యాన్ని పాటించిన పురుషునికి 20 సంవత్సరాలు బ్రహ్మచర్యాన్ని పాటించిన కన్యతో గుణకర్మ స్వభావాలను బట్టి వివాహం జరగాలని దయానంద సరస్వతి సత్యార్థ ప్రకాశంలో పేర్కొన్నాడు

## బ్రహ్మచర్యం - యోగాభ్యాసం :

శరీరమనే నగరానికి వీర్యం రాజు లాంటిది వీర్యరూపంలోని రాజు బలవంతుడైతే

రోగ రూపం లోని శత్రువులు దాడి చేయడానికి సాహసించరు ఒక వేళ వీర్య రూపంలోని రాజు విషయ లోలుడై బలహీనుడుగా మారినప్పుడు రోగరూపంలోని శత్రువుల దాడి తప్పదు

బ్రహ్మచర్యాన్ని పాటించే మానవుడు ఉత్తమ వ్రతశీలిగా పరిగణించబడతాడు అతనికి మాత్రమే సంపూర్ణంగా సుఖం అనుభవించ గలిగిన అర్హత లభిస్తుంది భక్తి, జ్ఞాన,. కర్మయోగాలలో ప్రవేశించే యోగ్యత సిద్ధిస్తుంది

''యోగశ్చిత్తవృత్తి నిరోధః'' యోగదర్శనం, 2

యోగమనగాచిత్తవృత్తులను నిరోధించడం ప్రమాణం, విపర్యయం, వికల్పం, నిద్ర, స్మృతి అనే ఐదు చిత్త వృత్తులు బ్రహ్మచారి వీటిని సులభంగా నిరోధించగలుగుతాడు

బ్రహ్మచర్యమే తపస్సు దీని కంటె మించిన తపస్సు మరోటి లేదని విద్వాంసులు భావిస్తారు బ్రహ్మచర్యమే మహాబలం అది అన్ని బలాలలోకెల్ల శ్రేష్ఠమైంది ఒక్క బ్రహ్మచర్యాశ్రమంలోనే కాక తక్కిన ఆశ్రమాలలోను మానవులు ఉత్తమ దినచర్యను అనుసరించాలి రాత్రి వేళకు నిద్రించి బ్రహ్మ ముహూర్తంలో లేవాలి శయ్యమీద కూర్చొని పరమాత్మున్ని స్మరించుకోవాలి శౌచకృత్యాలు తీర్చుకొని ఆ తర్వాత శరీరానికి నూనె పట్టించుకొని వ్యాయామం చేయాలి ఆసనాలు వేయాలి చన్నీటి స్నానం చేసి సంధ్యోపాసనకు ఉపక్రమించాలి ఈ సంధ్యను సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయం తర్వాత విధిగా రోజుకు రెండు సార్లైనా నిర్వహించాలి

సమ్యక్ ధ్యానమే సంధ్య చీకటి వెలుగుల సంయోగ సమయమే సంధ్యాకాలంగా చెప్పబడుతుంది సంధ్యోపాసనకు ముందు కనీసం మూడు సార్లు ప్రాణాయామం చేయాలి ఊపిరితిత్తులలో నిండిన గాలిని ముక్కురంధ్రాల ద్వారా బలవంతంగా బయటికి పంపించి, కొంతసేపటి దాకా బయటి గాలి లోనికి రాకుండా చూసుకోవాలి తర్వాత నెమ్మదిగా గాలిని లోపలికి తీసుకోవాలి మళ్లీ వెలుపలికి పంపించి దాన్ని కొంత సేపు ఆపి ఉంచాలి దీన్నే బాహ్యప్రాణాయామం అంటారు ఇట్లే బయటి గాలిని లోపలికి పీల్చుకొని శక్తికొలది లోపలనే నిలిపి వేయాలి ఆ తర్వాత నెమ్మదిగా లోపలిగాలిని బయటికి పంపించి తిరిగి వెలుపలి గాలిని లోపలికి పీల్చాలి కొంత సేపు దానిని అక్కడే ఆపి ఉంచాలి దీన్నే ఆభ్యంతర

ప్రాణాయామం అంటారు ఈ విధంగా బాహ్యాభ్యంతర ప్రాణాయామాలను ఒక్కొక్కటి మూడు సార్లైనా చేయాలి ప్రాణవాయువును బయటికి వదలక లోపలికి పీల్చుకొనక ఎక్కడి దాన్ని అక్కడనే నిలిపివేసే పద్ధతిని స్తంభవృత్తి అంటారు

ప్రాణాయామానికి ముందు ఉచితమైన ఆసనంలో కూర్చోవాలి స్థిరంగాను, సుఖంగాను కూర్చోవడానికి వీలైందే ఆసనం ఎంత సేపైనా కదలకుండా, ఎలాంటి బాధ లేకుండా కూర్చోగల్గిన ఆసనమే సమాధి సిద్ధికి సాధనమవుతుంది ఆసనాలన్నీ సమాధికి సాధనాలు కావు ఆసనాలు చేయడం యోగాభ్యాసంకాదు కొందరు యాభై, అరవై ఆసనాలు నేర్చుకొంటారు వాటినే చేస్తుంటారు చాల ఆసనాలు కఠినమైనవి వాటికి ఎగరడం, దూకడం అవసరం ఈ ఆసనాలు ఒకరకమైన వ్యాయామమే వీటిని నియమపూర్వకంగా అభ్యాసం చేస్తే శరీరానికి ప్రయోజనం కల్గుతుంది కాని ఆసనాలనే యోగం అనుకొని, వాటి ద్వారా ఈశ్వర సాక్షాత్కారం లభిస్తుందనుకోవడం పొరపాటు

శరీరంలో జరిగే సామాన్య చేష్టలన్నీ నిలిపి వేసి పరమేశ్వరుణ్ణి స్మరించాలి అణువణువున వ్యాపించి ఏమాత్రం చలించకుండా, స్థిరంగా ఉన్న పరమాత్మను ధ్యానించడంవల్ల సాధకునిలో స్థిరత్వం ఏర్పడుతుంది ముముక్షువు ప్రతి దినం కనీసం రెండు గంటలైనా ధ్యానం చేయాలని దయానందుడు సత్యార్థప్రకాశంలో చెప్పినాడు ఉభయ సంధ్యలలో ఒక్కొక్క గంట చొప్పున ధ్యానం చేస్తే బాగుంటుందని దీన్ని బట్టి తెలుస్తుంది బ్రహ్మచారి విధిగా ప్రాణాయామంతోపాటు ధ్యానం చేసే విధానాన్ని అలవర్చుకోవాలి. ప్రాణాయామ సమయంలో మనస్సులో పరమేశ్వరుని నామమైన "ఓం" గాని, ప్రాణాయామ మంత్రమైన "ఓమ్ భూః, ఓమ్ భువః, ఓమ్ స్వః, ఓమ్ మహః, ఓమ్ జనః, ఓమ్ తపః, ఓమ్ సత్యమ్" ను గాని, లేదా అర్థ సహితంగా గాయత్రీ మంత్రాన్ని గాని జపించాలి

ప్రాణాయామం వల్ల ఉపాసకునికి ప్రాణం వశమవుతుంది ప్రాణం స్థిరపడినప్పుడు మనస్సు స్థిరపడుతుంది మనస్సు స్థిరపడినప్పుడు ఆత్మ కూడా స్థిరపడుతుంది. ఈ మూడూ స్థిరపడినప్పుడే ఆత్మలోని ఆనందస్వరూపుడైన పరమేశ్వరుని లో నిమగ్నం కావడానికి మంచి అవకాశం లభిస్తుంది మనిషి నీటిలో మునిగి, పైకివచ్చి మళ్లీ మళ్లీ మునిగే విధంగా ఆత్మ పరమాత్మలో నిమగ్నం కావాలి

పురుషులతోపాటు స్త్రీలకు కూడా బ్రహ్మచర్యాది ఆశ్రమాల లాగా యోగసాధన అవసరమే దయానందుడు వివాహం ఇష్టపడనివారు మరణపర్యంతం బ్రహ్మచారులుగా ఉండ వచ్చునని తెలిపినాడు కాని ఇది పూర్ణవిద్వాంసులు, జితేంద్రియులు, యోగులు అయిన స్త్రీ పురుషులకే సాధ్యం స్త్రీలు యోగాభ్యాసం చేయాలా వద్దా అనే సందేహానికి తావు లేకుండా దయానందుడు స్త్రీలు కూడా యోగాభ్యాసం చేయాలని సత్యార్థప్రకాశం లోని ఐదవ సముల్లాసంలో వివరించినాడు

ఇంద్రియాలను నిగ్రహించుకోలేని వ్యక్తి బ్రహ్మచర్యం నుండి సరాసరి సంన్యాసాన్ని స్వీకరించరాదు నిగ్రహ శక్తి ఉన్నవాడు, శబ్దాది విషయగత దోషాలను తెలిసిన వాడు, వీర్యం యొక్క గొప్పతనాన్ని స్వయంగా ఎరిగిన వాడు ఎన్నడూ విషయలోలుడు కాడు ఎవరి వీర్యం వారి ఆలోచనాగ్నికి ఇంధనం లాంటిది అది దాని లోపలనే వ్యయమవుతుంది రోగికే వైద్యుడు, ఔషధాలు అవసరం ఆరోగ్యవంతునికి అవసరం లేదు అట్లే విద్యాభివృద్ధి, ధర్మాభివృద్ధి కలగాలని కోరుతూ ప్రపంచానికి మేలు జరగాలనే అభిప్రాయం ఉన్న స్త్రీ పురుషులు వివాహం చేసుకోవలసిన అవసరం లేదు పంచశిఖాది పురుషులు, గార్గి మొదలైన స్త్రీలు వివాహం చేసుకోలేదు లోకశ్రేయస్సే వారి తపస్సు కాబట్టి యోగ్యులైన వారే సంన్యాసులు కావాలి అయోగ్యులు సంన్యాసులైతే తాము చెడి పోవడమేకాక ఇతరులను కూడా పాడుచేస్తారు అని మహర్షి దయానందుడు సత్యార్థప్రకాశంలో వివరించినాడు

యోగాన్ని సాధించగల సామర్థ్యం స్త్రీ పురుషులిద్దరిలో సమానంగా ఉన్నప్పుడు స్త్రీ శరీరంలోని జీవాత్మ యోగ సాధన చేయజాలదని చెప్పడం అవివేకం

బృహదారణ్యకోపనిషత్తులో మైత్రేయి తన భర్త ఐన యాజ్ఞవల్క్యుణ్ణి "ధనంతో పాటు భూగోళమంతా నాకు లభించినట్లైతే మోక్షాన్ని నేను అనుభవించగలనా " అని ప్రశ్నించినప్పుడు అతడు "లేదు, ధనం వల్ల మోక్షాన్ని పొందలేము" అంటాడు వెంటనే మైత్రేయి దేనివల్ల మోక్షం లభిస్తుందో చెప్పమంటుంది. యాజ్ఞవల్క్యుడప్పుడు-1

"ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయి, ఆత్మనో వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేనేదం సర్వం విదితమ్" అని అంటాడు దానికి నా బృహద్గీత లోని తెలుగుసేతను గమనించండి

"ఆత్మనే దర్శింప వలయును
ఆత్మనే ఆలింప వలయును
ఆత్మనే చింతింప వలయును
ఆత్మనే ధ్యానింప వలయును" 2 4 17

"ఆత్మనే కని వినుట చేతను
ఆత్మ యందలి తలపు చేతను
ఆత్మ విజ్ఞానమ్ము చేతను
సర్వమును తెలియంగవచ్చును" 2 4 18

మైత్రేయి మోక్షాన్ని కోరి యాజ్ఞవల్క్యుణ్ణి ప్రశ్నించగా అతడు దాన్ని వివరిస్తూ ఆమెను మోక్షానికి అర్హురాలిగా గుర్తించినట్లు ఈ సంవాదాన్ని బట్టి తెలుస్తుంది యాజ్ఞవల్క్యుణ్ణి బ్రహ్మచారిణి గార్గి అడిగిన ప్రశ్నలను బట్టి కూడా స్త్రీ మోక్ష విద్యలో అత్యంత నిపుణురాలనే విషయం స్పష్టమవుతుంది కాని స్త్రీలకు యోగాధికారం లేదనే విషయం ఆర్షగ్రంథాలలో ఎక్కడా ప్రస్తావింపబడలేదు

## బ్రహ్మచర్యం – నైతికశిక్షణ:

ఈ నాడు మనం వైదిక సంస్కృతికి దూరం కావడం మూలాన పాశ్చాత్య నాగరికత ప్రభావం వల్ల నైతిక విద్యకు దూరమయ్యాం పిల్లలను మంచి పౌరులుగా చేసే విద్యావిధానం కొరవడడం వల్ల వారి నుండి సత్ప్రవర్తనను ఆశించ లేకపోతున్నాం పూర్వ కాలంలో గురుకులాలుండేవి. తల్లిదండ్రులు, ఆచార్యులు మనకు నైతిక శిక్షణ ఇచ్చేవారు

"మాతృమాన్ పితృమానాచార్యవాన్ పురుషో వేద"

శతపథబ్రాహ్మణమ్–1 14 6 10 2

తల్లి, తండ్రి, ఆచార్యుడు ఈ ముగ్గురూ ఉత్తమశిక్షకులైనప్పుడు పిల్లలు జ్ఞానవంతులవుతారు విద్వాంసులైన తల్లిదండ్రుల వల్ల పిల్లలకు లభించే ఉపదేశం ఇంకెవ్వరి

వల్ల కూడా లభించదు అందుకే తల్లి పిల్లలకు మొదటి గురువు ఐదు సంవత్సరాల వరకు తల్లి శిక్షణ, ఎనిమిది సంవత్సరాల వరకు తండ్రి శిక్షణ, ఆ తర్వాత గురు కులంలో ఆచార్యనిచే శిక్షణ పిల్లలకు అత్యంతావశ్యకమైంది మిక్కిలి ప్రయోజనకరమైంది వీర్యరక్షణ వల్ల కలిగే ప్రయోజనాలను తల్లిదండ్రులు తమ సంతానానికి తెలియపరచాలి ఎవరి శరీరంలో వీర్యం సురక్షితంగా ఉంటుందో వారికి ఆరోగ్యం, బుద్ధి, బలం, పరాక్రమం సమృద్ధిగా లభిస్తాయి

శబ్ద స్పర్శ రూప రస గంధాలను విషయాలంటారు బ్రహ్మచారులు వాటికి సంబంధించిన కథలకూ, విషయలోలుర సాంగత్యానికీ, స్త్రీల సాంగత్యానికీ దూరంగా ఉండి ఉత్తమ శక్షణనూ, పూర్ణ విద్యనూ సంపాదించాలి శరీరంలో వీర్య రక్షణ విషయంలో చిన్న తప్పు చేసినా దాన్ని సవరించుకోవడానికి ఈ జన్మలో మళ్లీ అవకాశం లభించదనే విషయాన్ని గ్రహించాలి తల్లి దండ్రులు, ఆచార్యుడు తమ సంతానాన్ని, శిష్యులనూ నైతిక శిక్షణ విషయంలో దండించవచ్చు ఆ విధంగా దండిస్తే అది తమ సంతానానికి, శిష్యులకు అమృత పానం చేయించినట్లే అవుతుంది బాధ్యతారహితంగా వ్యవహరిస్తూ పిల్లలను లాలించేవారు తమ పిల్లలకు పరోక్షంగా విషాన్ని త్రాగించిన వాళ్లవుతారు

సంతానానికి ఉత్తమ విద్య, శిక్షణ, గుణకర్మలు, ఉత్తమ స్వభావం అనే ఆచారాలను ధరింపజేసే తల్లి దండ్రులు, ఆచార్యులే ఉత్తములు ఆభరణాలతో మనుష్య శరీరం అందంగా కనిపించవచ్చు గాని ఆత్మకు వాటి వల్ల ప్రయోజనం లేదు బాలబాలికలు బ్రహ్మచర్యంలో ఉన్నంత కాలం విషయధ్యానం, విషయకథ, స్పర్శనం, పరస్పర క్రీడ, పరస్పర దర్శనం, ఆలింగనం, ఏకాంత సేవనం, సంగమం అనే ఎనిమిది పనులకు దూరంగా ఉండాలి -"స్మరణం కీర్తనం కేలిః ప్రేక్షణం గుహ్యభాషణమ్, సంకల్పోధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తిరేవచ"

కనుక తల్లిదండ్రులు, ఆచార్యుడు పిల్లలకు బాల్యం నుండి సద్బుద్ధిని అందించే ప్రయత్నం చేయాలి

"అద్భిర్ గాత్రాణి శుధ్యన్తి, మనః సత్యేన శుధ్యతి,

విద్యాతపోభ్యాం భూతాత్మా, బుద్ధిర్ జ్ఞానేన శుధ్యతి" మనుస్మృతి, 5.109

నీటి వల్ల శరీరావయవాలు, సత్యాన్ని ఆచరించడం వల్ల మనస్సు, విద్య వల్ల జీవాత్మ, జ్ఞానం వల్ల బుద్ధి పవిత్రం అవుతాయి

తల్లి మాత్రమే సంతానాన్ని ధర్మమార్గంలో నడిపించ గలుగుతుంది అందుకు ఆమె మొదట సత్ప్రవర్తన కల్గి ఉండాలి సరళ స్వభావం కల్గి ఉండాలి మధుర భాషణ కల్గి ఉండాలి కర్తవ్యశీలి కావడంతో పాటు దేశంపట్ల, ధర్మం పట్ల గౌరవం కల్గి స్వయంగా ధార్మికురాలు కావాలి. ఇంకా చెప్పాలంటే ప్రతి మహిళ వీరవనిత కావాలి, విదుషీమణి కావాలి

ఎప్పటి దాక వైదిక దినచర్య ఆచరింపబడదో అప్పుడిదాక నిజమైన అభివృద్ధి సాధ్యంకాదు పాశ్చాత్య నాగరికత, విద్యల కారణంగా వ్యభిచార ప్రవృత్తి అధికమవుతుంది ఆర్ష సంస్కృతికి చెప్పరాని అపకారం జరుగుతుంది దీన్ని భారతీయ స్త్రీపురుషులు గమనించాలి

నివాస యోగ్యంగా ఇల్లు కట్టకోలేనప్పటికీ, అప్పుడప్పుడు ద్వారబంధానికి మాత్రం అందమైన కర్టెన్ గుడ్డలు వ్రేలాడదీస్తాం మన వైభవాన్ని ఇతరులకు చూపి వారి మీద మన ప్రభావాన్ని వేస్తాం ఇదంతా ఇతరుల ముందు మన ఆధిక్యతను ప్రదర్శించడమే తప్ప మరోటి కాదు ఇట్లే ఒకరి ప్రభావానికి మరొకరం లొంగిపోయి, మన వైభవాన్ని చాటుకోవడానికి వ్యాపారంలో అవినీతికి పాల్పడుతాం అక్రమంగా సంపాదించిన డబ్బుతో కళ్లు జిగేలుమనే దుస్తులను, వస్తువులను కొంటాం కాని రంగు రంగుల ఆకర్షణీయమైన దుస్తులను ధరించడం వల్ల యువతీ యువకుల్లో కామ ప్రవృత్తి అధికమై బ్రహ్మచర్యాన్ని దెబ్బతీస్తుందన్న విషయాన్ని విస్మరిస్తున్నాం

ఈ భూమి మీద మనల్ని మంచి మార్గంలో నడపగల్గిన మహాపురుషులు ఎంతో

మంది జన్మించినప్పటికీ వారి చరిత్రలను మనం వక్రీకరించాం కొందరు సీతామాత శీలాన్ని శంకించారు రాముణ్ణి న్యాయ విరోధిగా చిత్రించారు కృష్ణుణ్ణి చోరునిగా లెక్కించారు వ్యభిచారిగా గాథలు రచించారు ద్రౌపది పంచభర్తృకగా చూపెట్టబడింది కుంతి, మాద్రి, సత్యవతి మొదలైన నారీమణుల చరిత్రలు కళంకితమయ్యాయి అమాయకులైన ప్రజలు ధర్మవిరుద్ధమైన కల్పితగాథల మీద మక్కువ చూపుతూ వాటిచేత ఆకర్షితులు కావడానికి మన పుస్తకాలలోని కల్పిత గాథలు ఎంతో దోహదం చేశాయి కొందరు కామ వాసనలను తీర్చుకోవడానికే జన్మించినట్లు భావిస్తున్నారు ఏడాది పొడవునా భోగించడానికి కాక ఈ శరీరం మరెందుకని ప్రశ్నిస్తున్నారు ఆ పరమేశ్వరుడు మనల్ని కేవలం భోగజీవులుగా రచించాడనే భ్రమలో మునిగి ఉన్నారు

నిజానికి భోగం అంటే సుఖదుఃఖానుభవం మనం చేసే కర్మలను బట్టి సుఖదుఃఖాలు మన వెన్నంటి ఉంటాయి కర్మఫలాలను అనుభవించ కుండా తప్పించుకునే మార్గం లేదు అనుభవించడం వల్లనే కర్మలు తీరిపోతాయి కనుక ప్రతి మనిషి సత్కర్మలను ఆచరిస్తూ జీవించాలి వేదం ఇదే విషయాన్ని మనకు ఉపదేశిస్తుంది

"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః,
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే" ఈశ, 2

పరమేశ్వరుడు న్యాయాధీశుడని భావించి, అతని ఆజ్ఞ పాలింపదగిందని నిర్ణయించి, సోమరితనం విడిచిపెట్టి శుభకర్మలు చేయాలి యుక్తాహార విహారాలచే నూరేండ్లు జీవించాలి కామసుఖాలు అనుభవించడానికే భగవంతుడు సృజించాడనడం ఆ భగవంతుణ్ణి మన పాపంలో భాగస్వామిని చేయడమే కాని మరోటికాదు

వీర్యాన్ని అధికంగావ్యయం చేయడం ద్వారా ఎవరైతే అధిక సుఖాన్ని పొందాలనుకొంటారో వారు చివరికి నిరాశ పాలౌతారు తొందరగా మృత్యుముఖంలోకి ప్రవేశిస్తారు కామోపభోగం వల్ల ఎన్నటికీ తృప్తి తీరదు అమూల్యమైన జీవితకాలం వ్యర్థమౌతుంది కూడా బాల్య వివాహాల వల్ల, బహుభార్యాత్వం వల్ల కలిగే నష్టాలను గూర్చి మన వాఙ్మయం నుండి ఎన్ని ఉదాహరణలైనా చెప్పుకోవచ్చు

యయాతి మహారాజు శుక్రుని కూతురైన దేవయానిని, వృషపర్వుని కూతురైన శర్మిష్ఠను అర్ధాంగులుగా చేపట్టాడు వారిద్దరితో సాంసారిక జీవితాన్ని గడపడం వల్ల తొందరగానే అతడు తన యౌవనాన్ని కోల్పోవలసి వచ్చింది కాని, ఇంకా తన అర్ధాంగులతో సుఖాలు అనుభవించాలనుకొన్నాడు మళ్లీ యౌవనం కోసం ప్రయత్నించినాడు అందుకు తన పుత్రులు ఎంతో మంది వైద్యులను తెచ్చి మందులిప్పించారు కాని ప్రయోజనం లభించలేదు చివరికి శర్మిష్ఠ వలన కలిగిన పూరుని వల్ల తగిన ఔషధాన్ని సంపాదించి, సేవించి తన మనోరథాన్ని తీర్చుకొన్నాడు ఆవిధంగా యయాతి మరికొంతకాలం తన భార్యలతో సుఖించి, తన మనోరథాన్ని తీర్చిన పుత్రునికి రాజ్యాన్ని అర్పించి, వానప్రస్థ దీక్షను పొంది అడవులకు వెళ్లినాడు

శంతనునికి సత్యవతి వల్ల చిత్రాంగద విచిత్ర వీర్యులనే ఇద్దరు కుమారులు కలిగినారు. వారిలో చిత్రాంగదుడు చిత్రంగదుడనే గంధర్వునితో యుద్ధంచేసి ప్రాణాలు కోల్పోయినాడు విచిత్రవీర్యుడు భీష్మునిచే అపహరింపబడి తేబడిన కన్యలలో అంబికను, అంబాలికను వివాహ మాడినాడు కాని అతడు పూర్ణ యౌవనుడు కానప్పటికీ నిరంతరం భార్యాలోలుడై కామ సుఖాలననుభవించి క్షయ వ్యాధిగ్రస్తుడై చివరికి మరణించినాడు.

వీర్యరక్షణ విషయంలో మనం ఎంత అప్రమత్తంగా ఉండాలో ఈ క థలు నిరూపిస్తున్నాయి

## అశ్లీల గ్రంథాలను చదవరాదు, సినిమాలను చూడరాదు:

ఈనాడు ఎంతో మంది అభాగ్యులు చెత్తపుస్తకాలను ముఖ్యంగా అశ్లీలగ్రంథాలను చదివి తమ భవిష్యత్తును చేతులారా పాడుచేసు కొంటున్నారు నగ్న, అర్ధనగ్న దృశ్యాలుగల సినిమాలను చూస్తున్నారు వీటి కారణంగా చెడు స్వప్నాలు కంటూ అనారోగ్యానికి లోనౌతున్నారు నిటారుగా నిలబడడానికి కూడా అసమర్థులవుతున్నారు ఇంకా ఎన్నో అవాంఛనీయమైన పనులకు సన్నద్ధు లవుతున్నారు వ్యాపార దృష్టితో వస్తున్న సినిమాలలో అశ్లీల దృశ్యాలు ఎక్కువగా ఉంటున్నాయి ఒక మంచి సినిమా రాక పోయినా నష్టం లేదుకాని ఒక చెడు సినిమా విడుదలైతే సమాజానికి దాని వల్ల తీవ్రమైన నష్టం ఉంటుందన్న విషయం మరవరాదు ఒక వేళ నిర్మాత చాల డబ్బును ఖర్చు పెట్టి ఒక అశ్లీల చిత్రాన్ని భారీగా నిర్మించినప్పటికీ దానికి ప్రభుత్వం ప్రదర్శన యోగ్యతను కల్పించరాదు ఆ సినిమా విడుదల

కాక పోవడం వల్ల అంత భారీ ఎత్తున నిర్మించిన నిర్మాతకు లక్షల రూపాయలలో నష్టం కల్గవచ్చుగాని, ఒక వేళ అది విడుదలైతే దాని ప్రభావానికి ఎంతో మంది జీవితాలు నాశనం కావడమే కాక, సమాజం కోట్ల ధనం కంటె విలువైన సాంస్కృతిక సంపదను కోల్పోవలసి వస్తుంది

సినిమాలలో హీరోయిన్ల వస్త్రధారణ, నృత్యాలు యువకులనే కాక వయసు మీరిన వారిని కూడ ఒక విధమైన కామోద్రేకానికి గురి చేస్తున్నాయి సమాజానికి కలిగే లాభం కంటె నిర్మాతకు, దర్శకునికి, నటునికి కలిగే లాభం ఎప్పుడూ ఎక్కువ కాదు ఈ రోజా సినిమాల వల్ల ఏర్పడే దుష్పరిణామాలు ఇన్నన్నికావు ఒక మాటలో చెప్పాలంటే ,సెక్స్ పుస్తకాల కంటె, శృంగార కావ్యాల కంటె భయంకరంగా సినిమాలు తయారయ్యాయి. బ్రహ్మచర్య దీక్షకు గొడ్డలి పెట్టుగా తయరైన ఇలాంటి సినిమాలను సెన్సారు వారు విడిచి పెట్టడం భావ్యం కాదు సినిమాల పేర్లు మొదలుకొని అందలి సంభాషణలు మానవ మస్తిష్కాలను వేడెక్కించి అనైతిక చర్యలకు పాల్పడేటట్లు చేస్తున్నాయి ప్రతి పౌరునికి సమాజం పట్ల ఒక బాధ్యత ఉంది అది ఏమంటే తన స్వార్థం కోసం సామాజిక విలువలను కాల రాయకుండా ఉండడం

నేటి మనుష్యుల్లో పుస్తకపఠనం తగ్గి పోయింది ఆ స్థానాన్ని టీవీలు, సినిమాలు ఆక్రమించాయి ఈ రోజా సినిమాలను గాని, టీవీ దృశ్యాలను గాని చూడని మానవులు ప్రపంచంలో ఎక్కడా లేరంటే అతిశయోక్తి కాదు ఇట్టి మీడియాను సమాజాన్ని పాడు చేయడానికి ముఖ్యంగా యువకులను పెడద్రోవ పట్టించడానికి ఉపయోగించడం క్షమించరాని నేరం విన్నదాని కంటె చూసిన దాని ప్రభావం వెయ్యి రెట్లు ఎక్కువగా ఉండడ సత్యం అర్షమర్యాదలను, నైతిక విలువలను పూర్తిగా ఉల్లంఘించి మానవులను పెడ( పట్టిస్తున్న సినిమా రంగాన్ని ప్రక్షాళనం చేయవలసిన అవసరం ప్రభుత్వం మీద ఉ ప్రజలు కోరుతున్నారు కాబట్టి సినిమాలు తీస్తున్నాం అని చెప్పే దర్శకుల మా నమ్మదగినవి కావు సామాజిక బాధ్యత గల మనుష్యులు సినిమారంగంలో ప్రభుత్వరంగంలో ఉన్నా, మరే ఇట్టి అశ్లీల చిత్రాలకు స్వస్తి చెప్ప వలసిన అవసరం ఉన్నది

వేదభూమిగా ప్రసిద్ధి పొందిన భారతదేశంలో ప్రతిరోజా ఎన్నో అశ్లీల చిత్రాలు

అవుతున్నప్పటికీ ఒక్కటి కూడా నిషేధింపబడకపోవడం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది వ్యభిచారం ఎలాంటి నేరమో వ్యభిచారాన్ని ప్రోత్సహించే లేదా చూపించే చిత్రాలు నిర్మించడం అంతే నేరం. హింస చేసినవాణ్ణి, దొంగతనం చేసిన వాణ్ణి ఎట్లా శిక్షిస్తామో అట్లే ఆ దృశ్యాలను చిత్రీకరించి మన మీద దుష్ప్రభావాన్ని కలిగించే వారిని కూడా శిక్షించవలసి ఉంది.

బ్రహ్మచర్యాన్ని దెబ్బతీసే ఏ పుస్తకం కాని, ఏ చిత్రం కాని రాకుండా ఉండడం ఎంతైనా మంచిది బ్రహ్మచర్యాన్ని అవలంబించి లోకోపకారం చేసిన ఋషుల యొక్క మహాపురుషుల యొక్క జీవితాలకు మచ్చ తెచ్చే కల్పనాత్మకమైన వాఙ్మయాన్ని నిషేధించాలి గౌతముడు, విశ్వామిత్రుడు మొదలైన ఋషుల బ్రహ్మచర్యానికి కళంకాన్ని కల్గించే కథలను సాహిత్యం నుండి వేరు చేయాలి రాముడు ఏక పత్నీవ్రతుడు కదా! అతని తర్వాత పుట్టి, అంతటి వాడుగా పేరుగాంచిన కృష్ణుడు రుక్మిణితో తప్ప మరొక స్త్రీతో సంసారం చేయడం వేద సంస్కృతికి విరుద్ధం కృష్ణుడు రుక్మిణీ వల్లభుడే గా ని మన కవులు అల్లిన కట్టుకథలలో లాగా సత్యభామా ప్రియుడు కాడు, గోపికాలోలుడు అంతకంటె కాడు కృష్ణుడు అష్ట మహిషీ వల్లభుడనడం, పదహారు వేలమందిని పెండ్లిచేసుకొన్నాడనడం స్త్రీలోలురైన కవుల కల్పనలే గాని శాస్త్ర సమ్మతమైన అంశాలు కావు కృష్ణుడు యోగీశ్వరుడు అతడు చిరకాలం బ్రహ్మచర్యాన్ని పాటించి, అనన్యమైన సామర్థ్యాన్ని సంపాదించి బాల్యంలో చాణూర ముష్టికులను, కంసాదులను సంహరించినాడు రుక్మిణిని వివాహమాడిన తర్వాత కూడా పన్నెండు సంవత్సరాలు బ్రహ్మచర్యాన్ని పాటించి ప్రద్యుమ్నుణ్ణి కన్నాడు మన దౌర్భాగ్యం ఏమంటే, అనసూయ, అహల్య లాంటి పతివ్రతల వ్యక్తిత్వాలను కించ పరిచాం వారిని ఉన్నతమైన స్థానాలలోనుండి దిగ జార్చినాం అనసూయాదేవిని నగ్నంగా వచ్చి అన్నం పెట్టమని త్రిమూర్తులు (ఇది నీచమైన కల్పన) అడిగినట్లు కల్పించిన కవులు క్షమించ దగిన వారు కారు అహల్యను ఇంద్రుడు సూర్యుని సహాయంతో అపహరించి తన కోరిక తీర్చుకున్నాడని రాసిన రాతలు రోతలే కాని యధార్థాలు కావు అగ్ని సదృశ, ద్రుపదుని ఏకైక పుత్రిక, అర్జునునిచే మత్స్యయంత్రం భగ్నం చేయబడి స్వయంవరంలో వరింపబడ్డ ద్రౌపది ధర్మం ప్రకారం అర్జునునికి మాత్రమే ఇల్లాలు కాని మన కవుల జారత్వం ఆమె శీలాన్ని మైల పరిచింది పాఠకులారా! ఒక స్త్రీ (కుంతి) మరొక స్త్రీ (ద్రౌపది) స్వాతంత్ర్యాన్ని అపహరించి ధర్మానికి విరుద్ధంగా రొట్టె ముక్కల్లాగా ఆమెను ఐదుగురికి

అంటుగట్టడం ఎంత వరకు సబబు ? ఎవడో ఒక మూర్ఖుడు భారతంలో బంగారం లాంటి ద్రౌపది కథ ను పాడుచేశాడు ద్రౌపది ఐదుగురికి అర్ధాంగి కావడానికి పూర్వ జన్మసంఘటనను ఒక దాన్ని సృష్టించి, దాన్ని భారతాన్ని రచించిన వ్యాసుని చేతనే ఒప్పింపజేయడం పచ్చి మోసం భారతీయ ఇల్లాండ్రకు జరిగిన మహాపకారం ఇంత కంటె మరేం ఉంటుంది! ద్రౌపది పూర్వ జన్మలో శివుణ్ణి పతి కావాలని ఐదుసార్లుఅడిగిందట. అందుకు శివుడు ఐదుగురిని భర్తలుగా ఇచ్చాడట ! ఇదేమైన నమ్మదగిందా ? భర్త కావాలని ఐదు సార్లు అడిగితే, భర్త కావాలన్న కోరిక ఆమెకు ఎంత తీవ్రంగా ఉందో అర్థం చేసుకోవాలి గాని ఐదుగురు భర్తలను ఈయడం ఏం సంస్కారం ? తర్కానికీ, ధర్మానికీ లొంగని అంశం ఇది ఉదాహరణకు లోకంలో ఒక అమ్మాయి తన తల్లిదండ్రులను నాకు భర్త కావాలి అని వెయ్యి సార్లు అడిగితే ఆ తల్లిదండ్రులు వెయ్యి మంది భర్తలను వెదకి తేవల్సిందేనన్న మాట ! ఎంత మోసం ? బుద్ధిలేని వాడెవడో ద్రౌపదిని పంచభర్తృకగా కథ అల్లి భారతంలో చేరిస్తే దాన్నిమనం తెలుగులో (కన్నడంలో తప్ప) అనువదించుకున్నాం దాంపత్యధర్మానికి విరుద్ధమైన అంశం ఇది బ్రహ్మచర్యానికి సరిపడని అంశం ఇది నీతి నియమాలు పాటించని వారే ద్రౌపదిని పాండవులైదుగురికి భార్యగా ఊహిస్తారు తప్ప, దాంపత్య ధర్మాన్ని అంగీకరించే వారు ఆ మహాసాధ్విని అర్జునునికి మాత్రమే అర్ధాంగిగా లెక్కిస్తారు

## బ్రహ్మచర్యం - ఆహారనియమం

సాధారణ జీవనంతో పాటు ఉన్నతమైన ఆదర్శం అన్ని విధాల శ్రేయస్కరం అందుకు మానవుడు ఉపయుక్తమైన ఆహారాన్ని స్వీకరించాలి కాని రుచికరంగా ఉందని అదే పనిగా భుజింప రాదు తిండిపోతుగా మారరాదు ఏది తిన్నా, ఎప్పుడు తిన్నా, ఎంత తిన్నా వివేకం విడిచి పెట్ట రాదు. భోజనం పవిత్రమైన స్థానంలో కూర్చొని చేయాలి ప్రేమ పూర్వకంగా ప్రశాంతమైన మనస్సుతో చేయాలి ఏ సమయంలో నాసికలో సూర్యనాడి సంచరిస్తుందో ఆ సమయంలో భోజనం చేస్తే తొందరగా జీర్ణమవుతుంది ఎందుకంటే ఆ సమయంలో జఠరాగ్ని ప్రజ్జ్వరిల్లుతూ ఉంటుంది భోజన సమయంలో ఒక వేళ సూర్యనాడి పనిచేయక పోతే దాన్ని పని చేయించాలి ఎడమ కడుపులో కుడిచేయి పిడికిలి పెట్టి ఒత్తాలి అప్పుడు అది పని చేస్తుంది రాత్రి పూట ఎడమ దిక్కుకు ఒత్తిగిల్లి పడుకోవాలి

పగటి నిద్ర ఆరోగ్యానికి మంచిది కాదు ఒక వేళ పగటిపూట నిద్రించాలనుకుంటే కుడి దిక్కుకు బత్తిగిల్లి పడుకోవాలి. ద్రవ పదార్థాలు స్వీకరించే సమయంలో చంద్రనాడి పనిచేయడం ఆరోగ్యకరం ఒక వేళ సూర్యనాడి పని చేసే సమయంలో పాలు, నీళ్ళు, కాఫీ, టీలు సేవిస్తే వీర్యం నశిస్తుంది సూర్యనాడి పని చేసే సమయంలో ఘనాహారం, చంద్రనాడి పనిచేసే సమయంలో ద్రవాహారం తీసుకోవడం వల్ల ఆరోగ్యంతో పాటు వీర్యవృద్ధి కల్గుతుంది ముక్కు కుడి రంధ్రం నుండి సూర్యనాడి, ఎడమ రంధ్రం నుండి చంద్రనాడి సంచరిస్తాయి ఒక వేళ ద్రవపదార్థాలు సేవించాలని అనుకొంటే కుడి వైపు నుండి కాక ఎడమ వైపు నుండి శ్వాస తీసుకోవాలి.

రాత్రి సమయంలో భోజనం చాల తక్కువగా తీసుకోవాలి. అది కూడా బాగా పక్వమై జావగా ఉంటే మరీ మంచిది బాగా వేడి గల లేదా బాగా చల్లబడిన ఆహారం, ఎక్కువగా నూనెతో వండిన ఆహారం, కారం లేదా మసాలా దట్టించి వండిన ఆహారం వీర్యవృద్ధికి దోహదం చేసే నాడులను దెబ్బతీస్తాయి అత్యుష్ణం లేదా అతి శీతలం ఐన ఆహార పదార్థాల వల్ల, పానీయాల వల్ల దంతాలు బలహీనమవుతాయి ఆహారాన్ని బాగా నమలితినాలి భోజనానంతరం వ్యాయామం చేయ రాదు భోజనం చేస్తూ తప్పని పరిస్థితులలో తప్ప మధ్య మధ్య నీళ్ళ త్రాగ రాదు భోజనం చేయడానికి ఒక గంట ముందు గాని, భోజనానంతరం ఒక గంట సేపటికి గాని నీళ్ల త్రాగడం ఆరోగ్యానికి మంచిది దాని వల్ల ఆహారం తొందరగా జీర్ణమవుతుంది రాత్రి పూట ఫలాహారం తీసుకోవడం మంచిది భోజనం చేసే అలవాటుంటే చాల తక్కువగా తీసుకోవాలి బాగా రాత్రి గడిచినప్పుడు ఆహారం తీసుకోవడం మానెయ్యాలి

మన ఆహారంలో పండ్ల రసాలతో పాటు పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, మొదలైనవి ఉండేలా చూడాలి సాత్త్విక భోజనం మానవునిలో సత్త్వగుణాన్ని పెంచుతుంది కామక్రోధాది దుర్గుణాలు దూరమై శాంతి లభిస్తుంది మనం తీసుకొనే ఆహారాన్ని బట్టి మన మనస్సు ఏర్పడుతుంది అందుకే "యదన్నం తన్మనః" అని పెద్దలు చెప్పినారు సృష్టిలో పరమాత్మ మానవునికి శాకాహారాన్ని స్వీకరించే ఏర్పాటు చేశాడు సాత్త్వికాహారం వల్ల మనస్సు సాత్త్వికమై దుర్గుణాలకు దూరంగా ఉండే అవకాశం ఏర్పడుతుంది ముఖ్యంగా మానవుడు ఆరు దుర్గుణాలకు దూరంగా ఉండాలని వేదం చెబుతుంది వీటినే పండితులు షడ్గుణాలుగా వ్యవహరిస్తారు

"ఓం ఉలూకయాతుం శుశులూకయాతుం
జహి శ్వయాతుముత కోకయాతుం,
సువర్ణయాతుం ఉత గృధ్రయాతుం
దృషదేవ ప్రమృణ రక్ష ఇంద్ర" ఋ, 7 104 22; అథర్వ, 84 22

గుడ్లగూబ, తోడేలు, శునకం, ఊరపిచుక, గరుడ పక్షి, గ్రద్ధ – వీటిలాగా చెడుపనులు చేయరాదని ఈ మంత్రం యొక్క తాత్పర్యం. ఈ ఆరు ఆరుగుణాలకు సంకేతంగా చెప్పబడినాయి. గుడ్లగూబకు మోహం (చీకటి) ప్రియమైంది. అది ప్రకాశానికి భయపడుతుంది మనం అలాకాక వెలుగును (జ్ఞానాన్ని) అలవర్చు కోవాలి . తోడేలుకు క్రోధం ప్రియం మనం అలా కాక దయ కలిగి ఉండాలి కుక్కకు మాత్సర్యం ప్రియం మనం అలా కాక ఇతరుల యెడ ప్రేమ భావం కల్గి ఉండాలి, ఊరపిచుకకు కామం ప్రియం. మనం అలా కాక బ్రహ్మచర్యాది సద్గుణాలను పాటించాలి. గరుడపక్షికి మదం ప్రియం మనం అలా కాక ఆత్మసౌందర్యాన్ని పెంచుకోవాలి. గ్రద్ధకు లోభం ప్రియం. మనం అలాకాక స్వయంకృషితో అభివృద్ధి చెందాలి



మనిషికి మలమూత్ర విసర్జన క్రియలు స్వాభావికంగా జరగాలి వాటి వేగా నిరోధించే ప్రయత్నం ఎప్పుడూ చేయరాదు. అలా చేయడం వల్ల నాడులు దెబ్బతిని వీ‌ర నష్టం అవుతుంది మలబద్ధకం వల్ల కూడా వీర్యనాడులు దెబ్బతింటాయి ఒకవేళ మలబద్ధక ఏర్పడితే త్రిఫల చూర్ణం నీటిలో కలువుకొని సేవించడం మంచిది బజారులో తయారుచేసే ఆహారపదార్థాలను తినరాదు వైద్యుణ్ణి సంప్రదించకుండా ఎలాంటి ఔషధాలను స్వబుద్ధితో ఉపయోగించరాదు కడుపుకు విశ్రాంతి ఈయడానికి అప్పుడప్పుడు నిరాహారదీక్ష అవలంబిస్తే మంచిది

జఠరాగ్ని ఆహారాన్ని జీర్ణింపజేస్తుంది ఉపవాసం దోషాలను నశింపజేస్తుంది. ఉపవాసంవల్ల జీర్ణశక్తి పెరుగుతుంది ఐతే ఉపవాసం శక్తిని మించి పాటించరాదు. ఒక రోజా

పూర్తిగా ఉపవాసం ఉండి, మరుసటి రోజు మృష్టాన్నాన్ని భుజించడం వల్ల శరీరానికి కలిగే ప్రయోజనం ఏమీ లేదు ఎక్కువగా తినడం, లేదా ఎక్కువగా ఆకలితో ఉండడం రెండూ శరీరానికి హానికరమే ఉపవాసంవల్ల ఆత్మ చింతనకు అవకాశం ఏర్పడుతుంది మనిషి అంతర్ముఖుడు కావడం వల్ల కామ వికారాలు బలహీనమవుతాయి ఉపవాసం అంటే భోజనం మానెయ్యడం అని సామాన్యంగా అర్థం చెప్పుకొంటారు కానిదానిఅర్థం పరమేశ్వరునికి సమీపంగా ఉండడం ఉప = పరమేశ్వరునికి సమీపంలో, వాసం = ఉండడం, పరబ్రహ్మకు సమీపంలో ఉన్నప్పుడు ఆకలి దప్పులుండవు ఆ కారణంగా తిండికి దూరంగా ఉండడం జరుగుతుంది కనుక ఉపవాసం అన్నప్పుడు భోజనం మానెయ్యడం అనే అర్థం ప్రచారంలోకి వచ్చింది

మద్యం మొదలైన మత్తు పానీయాలను గాని, మాంసం మొదలైన పదార్థాలను గాని స్వీకరించరాదు దేన్నైనా భుజించడానికి ముందు దానివల్ల కలిగే లాభనష్టాలను తెలుసుకోవాలి మన శరీరానికీ, బుద్ధి వికాసానికీ తోడ్పడే ఆహారాన్ని ఏ ప్రమాణంలో తీసుకోవాలో తెలుసుకోవలసిన బాధ్యత మన అందరి మీద ఉంది

## బ్రహ్మచర్యమే మన ఆదర్శ జీవనం :

మనిషి మృత్యువును పొందకుండా అమరుడుగా ఉండజాలడు తాను అమరుడుగా ఉండాలంటే సంతానమే ఏకైక మార్గం కాని, ఉత్పత్తితో వినాశానికి విడదీయరాని సంబంధం ఉంది ప్రజోత్పత్తిలో వీర్య నాశం జరుగుతుంది వీర్యనాశం ద్వారా మృత్యురూపమైన మూటను తలమీద మోయ వలసి వస్తుంది

ఉత్పత్తితో వినాశానికి గల సంబంధాన్ని దృష్టిలో పెట్టుకొని బ్రహ్మచర్యానికి ప్రాధాన్యం ఈయడం జరిగింది. ఇరవైనాల్గు సంవత్సరాల వరకు బ్రహ్మచర్యాన్ని అవలంబించినా అది తక్కువే నేటి వైజ్ఞానికులు విజ్ఞానం విషయం లో చూపే శ్రద్ధను పూర్వకాలంలో మనవారు బ్రహ్మచర్యం విషయంలో చూపినారు అందుకు అనుగుణంగా గురుకులాలను నడిపినారు వారి ధ్యేయం మానవ జీవితాన్ని ఒడుదొడుకులు లేకుండా నడపగల్గే శక్తిని సంపాదించడమే పుస్తకాలను చదవడం, డిగ్రీలు సంపాదించడం నేటి విద్యాలయాల చరమలక్ష్యమైనట్లే బ్రహ్మచర్యాన్ని పాలించడం నాటి గురుకులాల పరమలక్ష్యం.

బ్రహ్మచర్యం నాటి వైజ్ఞానిక విషయం దాని కొరకై విద్వాంసులు బాగా ఆలోచించినారు జీవన పరమార్థాన్ని అందుకోవడానికి దాన్ని సాధనంగా చేసుకొన్నారు

బ్రహ్మచర్యం వల్ల శారీరక, మానసిక, ఆధ్యాత్మిక బలాలు చేకూరుతాయి అని పతంజలి యోగదర్శనంలో చెప్పినాడు వీర్యనాశం వల్ల మనిషి వెంటనే చని పోడుకాని, శక్తి నాశం జరుగుతుందన్న విషయాన్ని మాత్రం కాదనలేం

ఋషులు సదాచార జీవనానికి బ్రహ్మచర్యాన్ని ఒక సాధనంగా గుర్తించినారు బ్రహ్మచర్య నియమాలను రూపొందించినారు. వారు ప్రతిపాదించిన నియమాలలో మనోవైజ్ఞానిక విషయాలు ఇమిడి ఉన్నాయి

బాలబాలికలు గురు కులంలో ప్రవేశించగానే బ్రహ్మచర్య రక్షణకై ''మైథునం వర్జయ'' అని ఉపదేశింపబడుతారు జ్ఞానసాధనలో పంచేంద్రియాలను, మనస్సును ఇష్టం వచ్చినట్లు విహరింపజేయరాదు ఏ ఒక్క ఇంద్రియానికి లొంగినా బ్రహ్మచర్యాన్ని కాపాడు కోవడం కష్టం ఒకొక్క ఇంద్రియాన్ని వశంలో ఉంచుకోవడానికి సంధ్యావందనంలో చక్కని సూచనలు చేయడం జరిగింది ఇంద్రియాల దురుపయోగం వల్ల బ్రహ్మచర్యానికి హాని కలుగుతుంది ఆధునికులూ, పాశ్చాత్యులూ చెప్పిన అభిప్రాయాలను గమనిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది

పిల్లలకు అవకాశం లభిస్తే చాలు శబ్దాది విషయాలకు లొంగిపోతారు ఈ అవకాశం అనేది పిల్లలకే కాదు పెద్దలకూ ఇబ్బందికరమైందే సదాచారాన్ని ఉపదేశించే వారికి కూడా ఈ అవకాశం అనేది పాపహేతువవుతుంది కనుకనే ధార్మికులైన తల్లి దండ్రులు పిల్లలను విచ్చలవిడిగా వదలడానికి ఇష్టపడరు వారి ప్రతి కదలికపై కన్నేసి ఉంచుతారు పిల్లలను సామాన్యంగా ఏదో ఒక పనిలో నిమగ్నులయ్యేటట్లు చూస్తారు పనిలో ఉన్నప్పుడు పతనం అయ్యే అవకాశం తక్కువ కనుకనే ఋషులు వేదారంభంలో 'కర్మ కురు' అని బోధిస్తారు కాలాన్ని వ్యర్థంగా వ్యయం చేయరాదు కాబట్టి, బాల్యం నుండి కాలం యొక్క విలువను పిల్లలకు చెప్పాలి. ప్రతిక్షణం సామర్థ్యాది శక్తులను సాధించడానికీ, వాటిని ఉపయోగించడానికీ ప్రాచీనకాలంలో గురుకులాలుండేవి గురుకులాలు గ్రామాలకు, నగరాలకు దూరంగా ఉండడం వల్ల పిల్లలపై విషయ వాసనల దాడి ఎక్కువగా జరిగేది కాదు

బాల బాలికలు శబ్దాది విషయాల నుండి తమను తాము రక్షించు కోవాలి అప్పుడే బ్రహ్మచర్య వ్రతం పూర్తి అవుతుంది

శబ్దం. మనిషి అనుచిత మైన ఉద్వేగాన్ని ఆపడానికి గానం నిషేధింపబడింది గానం వల్ల బ్రహ్మచారులలో దుష్టభావనలు ఉత్పన్నమవుతాయి హేవలాక్ ఏలిస్ ''Sexual Selection in men'' అనే పుస్తకంలో గానానికి మనో వికారానికి గల సంబంధాన్ని గూర్చి వ్రాస్తూ "పశు పక్ష్యాదులతో పాటు మానవునిలో కూడా యౌవనావస్థలో మధురమైన గానం మానసిక భావాలతో సంబంధం కలిగి ఉంటుంది" అని వివరించినాడు

ప్లేటో సంగీతం మనిషి మనస్సుమీద విశేషమైన ప్రభావాన్ని చూపుతుందని చెప్పక పోయినప్పటికీ, కొన్ని రకాల సంగీతానికి మానసిక వికారాలు కల్గించే శక్తి ఉందని తెలిపినాడు మానవులలో సంగీతం వల్ల మద్యం మీద ఆసక్తి, కామవాంఛ, సోమరితనం పెరుగుతాయనీ, ప్రార్థన, యుద్ధ సంబంధమైన సంగీత మే తప్ప వీటికంటె భిన్నమైన సంగీతాన్ని స్త్రీపురుషులకు నేర్పరాదని అతడు అభిప్రాయపడినాడు

సంగీతం మనో వికారాలకు కారణం కావడం వల్లనే దానితో పాటు నృత్యం కూడా బ్రహ్మచారులకు నిషేధింపబడింది నృత్యానికి గానానికి ఉన్న సంబంధం అందరికీ తెలిసిందే కాని అన్ని రాగాలు ఉత్తేజాన్ని కలిగించవు కనుకనే సామ వేద గానం బ్రహ్మచారులకు విధిగా చెప్పబడింది

స్పర్శ బేన్ మహాశయుడు ''Emotions and Will'' అనే గ్రంథంలో స్పర్శ మానసిక ప్రేమకు ఆది మరియు అంతం అని పేర్కొన్నాడు మనోభావాలను జాగృతం చేసే గొప్ప సాధనం స్పర్శ మనుష్యులను ఉత్తేజపరచడంలో స్పర్శకు గల ప్రభావాన్నిబట్టి విదేశాలకు చెందిన పైంటా, ఏలిస్ మొదలైన రచయితలు సామాన్య స్పర్శను కూడా చెడుగా భావించినారు

డా బ్లాచ్ ''The sexual life of our times'' అనే గ్రంథంలో స్పర్శ వల్ల మానసిక వికారాలు కలగడానికి కారణం చర్మం యొక్క జ్ఞానతంతువులు మరియు ఉత్పాదక అంగాల యొక్క తంతువుల నిర్మాణం ఒకే పదార్థంతో జరగడమేనని నిరూపించినాడు స్పర్శ వల్ల

ఎదురయ్యే భయంకరమైన తుఫాను తాకిడికి తట్టుకోలేని వారు వాటి వల్ల కలిగే దుష్పరిణామాల నుండి తమ్ముతాము ఎన్నడూ రక్షించుకోజాలరని విశదపరచినాడు

బాలబాలికలు పరస్పరం చక్కిలిగింతలు పెట్టుకొని ఆనందించడం, చిన్న పిల్లలను పెద్దలు చక్కిలిగింతలు పెట్టి ఆనందింపజేయడం లోకంలో సామాన్యం. ఈ గిలిగింతల వల్ల ఉత్తేజానికి లోనై మనోవికారాలకు అవకాశం ఇచ్చిన వాళ్లం అవుతాం కనుక బాలబాలికలను మొదట ఈ అలవాటు నుండి దూరంగా ఉంచాలి పెద్దలు కూడా ఇలాంటిపనికి పూనుకోరాదు దేనినైనా అనవసరంగా స్పృశించడం బ్రహ్మచర్యానికి భంగకరమైన పనే కాని మరోటి కాదు బ్రహ్మచర్యానికి భంగం కలగకుండా బాలబాలికలను రక్షించడం ఆచార్యుల పని కాబట్టి వారు గురుకులాలలో ఎన్నో జాగ్రత్తలు తీసుకొనేవారు

"అకామతః స్వయమింద్రియ స్పర్శేన వీర్యస్ఖలనం విహాయ,
వీర్యం శరీరే సంరక్ష్యోర్ధ్వరేతః సతతం భవ"

ఇంద్రియస్పర్శ జరగకుండా, వీర్యస్ఖలనం కాకుండా, శరీరంలో వీర్యాన్ని రక్షించుకొంటూ ఊర్ధ్వరేతస్కుడవు కమ్ము-అని అలనాటి గురూపదేశం ఈ ఉపదేశం వల్ల నాటి గురువులకు నేటి గురువులకు గల తేడా ఏమిటో స్పష్టమవుతుంది నేటి విద్యా విధానం విద్యార్థిని అర్థార్థిని చేయడమే తప్ప సదాచారిని చేయడం లేదు బ్రహ్మచారిని అంతకంటే చేయడం లేదు నేడు విద్యాసంస్థలలో ఏ అధ్యాపకుడైనా విద్యార్థులను ఉద్దేశించి 'వీర్యరక్షణ మీ జీవిత లక్ష్యం' అని చెప్పే స్థితిలో లేడు గురుకులాలలోని ఆచార్యుల లక్ష్యం ఉన్నతమైంది అది విద్యార్థులకు సర్వదా సర్వథా శ్రేయోదాయక మైంది. కాని నేటి విద్యాలయాలలో దానికి విరుద్ధమైన వాతావరణం కనిపిస్తున్నది నేటి కాలంలో టీచర్ గాని, హెడ్‌మాస్టర్‌గాని, ప్రిన్సిపాల్ గాని విద్యార్థికి సదాచారాన్ని నేర్పడానికి సిద్ధంగా లేరంటే అతిశయోక్తి కాదు ఒకవేళ ఆచార్యులనబడేవారు ఉన్నప్పటికీ వారిలో సదాచారాన్ని గ్రహించాలన్న కోరిక మృగ్యం

రూపం · మనిషిలో మనోవికారాలను జాగృతం చేయడంలో చక్షురింద్రియం పాత్ర విశిష్టమైంది కనుకనే దాని మీద నియంత్రణ అవసరం నేటి పట్టణాలు, నగరాలు పాశ్చాత్య నాగరికతకు ఆలవాలమయ్యాయి అవి బాలబాలికల నైతిక పతనానికి ద్వారాలుగా మారాయి. ఎక్కడ చూసినా ఏదో ఒక దృశ్యం మనల్ని ఆకట్టుకొంటుంది అంతేకాదు, ప్రలోభపెడుతుంది కూడా నగరాల్లో నాటకాలు, సినిమాలు విశేషంగా ప్రదర్శింపబడడం

వల్ల వాటిలోని అసంగతమైన నృత్యాది సన్నివేశాలు యువకుల మీద విపరీతమైన ప్రభావాన్ని చూపుతాయి కృత్రిమ వస్తువుల మీద అధిక ప్రేమను కల్గిస్తాయి చాల మంది కృత్రిమ జీవితానికి అలవాటు పడతారని చెప్పడానికి ఉదాహరణ ఒక రష్యన్ మహిళ నాటకం చూడడానికి వెళ్లి దానిలో ఒక వ్యక్తి చలికి వణికి పోవడాన్ని చూసి కంట తడిపెట్టింది కాని, నాటకశాలకు బయట తన గుఱ్ఱంబండిని నడిపేవాడు చలి తీవ్రతకు తట్టుకోలేక వణికిపోవడాన్ని చూసి కూడా జాలిపడ లేదట!

నృత్యాదులను తిలకించడం వల్ల మనో వికారాల విజృంభణకు అవకాశం కల్గుతుంది మనిషి దుష్ప్రవర్తనకు లోనౌతాడు సదాచారానికి తీవ్ర విఘాతం కల్గడమేగాక శారీరక మానసిక ఉన్నతికి ఆటంకం ఏర్పడుతుంది నేత్రేంద్రియం యొక్క సదుపయోగాన్ని దృష్టిలో పెట్టుకొన్న విద్వాంసులు నృత్యాదులను నిషేధించారే కాని మరోటి కాదు

బ్రహ్మచర్య వ్రత నియమాలలో అద్దం చూసుకోవడం నిషేధింపబడింది యువతీ యువకులు తరుచుగా అద్దంలో తమ ప్రతి బింబాలను చూసుకొని మానసిక వికారాలకు లోనవుతారన్న ఉద్దేశంతో ఆ పని చేయడం జరిగింది ఈనాడు బాలికలు గంటల తరబడి అద్దాల ముందు నిలబడి తమ అంద చందాలను చూసుకొని భావనా లోకాల్లో విహరించడం అలవాటైంది అందుకు ఎంత సమయం వ్యర్థమవుతుందో విజ్ఞులకు తెలియంది కాదు బ్రహ్మచర్యాన్ని కాపాడడానికి చిన్నచిన్న విషయాలలో మన పూర్వీకులు ఎలాంటి జాగ్రత్తలు తీసుకొనే వారో దీన్ని బట్టి తెలుస్తుంది

రసం మనం ముఖ్యంగా పాటించ వలసిన ఆహారనియమాలను ప్రత్యేక శీర్షిక క్రింద ఇంతకు పూర్వమే పేర్కొన్నాను ఇక్కడ మరికొన్ని విశేషాలను పొందు పరుస్తున్నాను

మనుష్యులు బీడి, సిగరెట్టు, పొగాకు, సారా, గంజాయి, గుట్కా మొదలైన మత్తుపదార్థాలను అనుభవించడానికి కాక వాటిని మరెందుకు దేవుడు సృష్టించినాడని కొందరు వాదిస్తుంటారు. మరికొందరు బీడి, సిగరెట్టు త్రాగక పోతే కంపెనీలు ఏం కావాలి ? అని అంటారు నిజానికి బీడి, సిగరెట్టు, సారా వల్ల కల్గేనష్టాన్ని గుర్తించాలి కాని, కంపెనీలు నడవక పోతే ఎట్లా అనడం విచారకరం. ఎంతమంది మత్తు పదార్థాలను సేవించి అనారోగ్యం పాలవుతున్నారో, ఇల్లు గుల్ల చేసుకొంటున్నారో అర్థం చేసుకోవాలి పొగాకు వల్ల దగ్గు దమ్ము వంటి రోగాలు, సారాయి సేవించడం వల్ల బుద్ధి వక్రించడమేగాక కాలేయం పాడయిపోవడం, తమ పిల్లలు కూడా దుర్బలులు కావడం ప్రత్యక్షంగా చూస్తూనే

ఉన్నాం ఉదాహరణకు ఎంతోమంది దుర్వ్యసనాల కారణంగా దుర్బలమైన జీవితాన్ని గడుపుతూ స్వాముల చుట్టూ, మక్కోటి దేవతల చుట్టూ తిరుగుతుంటారు కాని ఎప్పటికైనా సత్యాన్ని ఆచరించవలసి ఉన్నది పరమాత్మ గులాబీలతో పాటు ముళ్ళు కూడా సృష్టించాడు కాని మనం పూలనే తెంపుకొంటాం కాని ముళ్లను తెంపుకోం కదా! ఇట్లే అగ్ని ఉంది దాంతో మనం వంట చేసుకొంటాం కాని ఇంటిని తగల బెట్టు కొంటామా? పశుపక్ష్యాదులకు కూడా తామేమి తినాలో తెలుసు గడ్డి తినని పశువును ఎక్కడైనా చూస్తామా ? మనకు దేవుడు మంచి బుద్ధిని ఇచ్చాడు కదా! దాంతో మనం ఏది యుక్తమో, ఏది అయుక్తమో తెలుసుకొని చక్కగా వ్యవహరించవలసిన అవసరం లేదా ? మనకు సృష్టిలో అనుభవించడానికి రకరకాల పండ్లున్నాయి అమృతంతో సమానమైన వాటి రసాన్ని త్రాగితే శరీరానికి ఎంతపుష్టి కల్గుతుంది ! కేవలం అనుభవించడానికి మత్తు పదార్థాలే లభించాయా మనుష్యులకు ? కేవలం వ్యాపారం చేయడానికి కూడా అవే లభించాయా వర్తకులకు ? భుజింపదగిన వెన్న, పెరుగు, పండ్లను విడిచి పెట్టి, భుజింప దగని వాని వెంట పడడం ఏం మంచిది ? ఇది అవివేకం అనిపించుకోదా ? చేయదగిన పనులనే చేయాలి తినదగిన పదార్థాలనే తినాలి అప్పుడే మనిషి అనిపించుకొంటాడు ఇంతగా చెప్పడం దేనికంటే మంచి ఆహారం వల్ల వీర్యం వృద్ధి అవుతుంది కనుక, ప్రతి మనిషి మనిషిగా మనుగడ సాగించాలంటే, పరాక్రమవంతుడుగా, ఆరోగ్యవంతుడుగా జీవించాలంటే వీర్య రక్షణ అవశ్య కర్తవ్యం ఒక వేళ దానికి విరుద్ధంగా వ్యవహరిస్తే జీవితం నరకం గా మారుతుంది. ఇక్కడ నరకం అంటే దుఃఖం అని అర్థం మత్తు పదార్థాలను స్వీకరించడం వల్ల కలిగే దుష్పరిణామాలను ఆలస్యంగా తెలుసుకొని బాధపడడం కంటె బాల్యంలోనే వాటి నుండి దూరంగా ఉండడం బుద్ధిమంతుల లక్షణం అధికంగా టీ, కాఫీ, సేవించడం వల్ల నపుంసకత్వం సంభవిస్తుందని డా బ్లాచ్ అభిప్రాయపడినాడు డ్యూఫ్రీ అనే శాస్త్రవేత్త జరిపిన పరీక్షలను బట్టి రోజుకు ఐదారు సార్లు కాఫీ త్రాగితే నపుంసకులవుతారు డా కైలాంగ్ "Plain facts" అనే గ్రంథంలో మనిషి ఆచార వ్యవహారాలపై పొగాకు కలిగించే దుష్ప్రభావాన్ని వివరించినాడు బాల్యంలో ఈ దుర్వ్యసనానికి లోనైనవారు తర్వాత కాలంలో విపరీత మైన పరిణామాలను ఎదుర్కోవలసి వస్తుందని హెచ్చరించినాడు నాసికా రంధ్రాలనుండి కాక, అంతఃకరణంలో ప్రజ్వరిల్లే దుర్వ్యసనాల జ్వాలలనుండి దురాచారమనే పొగ బయటికి వస్తుందని తేట పరచినాడు

డా బ్లాచ్ మహాశయుడు విపరీతంగా మిరాయిలను తినే వారిని మందలించినాడు. బాల్యంలోనే పిల్లలను ఈ అలవాటు నుండి మళ్లించాలని ప్రబోధించినాడు

ఈ కాలంలో ఆకలితో చనిపోయే వారి సంఖ్య కంటె ఎక్కువగా తిని చనిపోయే వారి సంఖ్యే ఎక్కువ వీర్య రక్షణ విషయంలో జాగ్రత్తగా మెలగక పోవడం వల్ల బొ్రవస్తుంది తిండిపోతు నాలుకను స్వాధీనంలో ఉంచు కోజాలడు ఆకలి లేక పోయినప్పటికీ, అవసరాన్ని మించి తింటాడు ఉపవాసం చేయడమంటే అతనికి కత్తి మీదిసాము ఆకలి ఐన దానికంటె కొంచెం ఎక్కువగా తినడం ఆరోగ్యవంతుని లక్షణం మన మనస్సు మనం తినే ఆహారాన్ని బట్టి ఏర్పడుతుందని ప్రాచీనులు నిరూపించినారు

'అన్నమయంహి సోమ్యమనః' అని ఉపనిషత్తు చెబుతున్నది గురుకులంలో ప్రవేశించగానే ఆచార్యుడు శిష్యునికి "తైలాభ్యంగనమర్దనాత్యమ్లాతితిక్త కషాయక్షార రేచన ద్రవ్యాణి మా సేవస్వ'' అని ఉపదేశిస్తాడు పులుపు, వగరు, చేదు, కారం ఎక్కువగా తినవలదని దాని భావం

బ్రహ్మచారి రోజాకు రెండు సార్లు మాత్రమే భుజించాలనీ, భోజనానికి ముందు అగ్ని హోత్రాన్ని నిర్వహించాలనీ మనుస్మృతి చెబుతుంది

అధికంగా భుజించడం వల్ల అనారోగ్యం కలుగుతుంది ఆయుస్సు క్షీణిస్తుంది ఇది లోకానికి మంచిదికాదు కనుక ఎక్కువగా భుజించడం మానాలి- అనికూడా మనుస్మృతి చెబుతుంది

"అనారోగ్యమనాయుష్య మస్వర్గ్యంచాతిభోజనమ్,

అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్ " 2 57

**గంధం :** నేడు బజారు రకరకాల వస్తువులతో నిండి పోయింది సుగంధద్రవ్యాల ఉపయోగం పెరిగిపోయింది సభ్యత పెరిగిన కొలది పూలతో తయారైన సుగంధ పూరిత వస్తువుల ఉపయోగం ఎక్కువైంది అవి మానవులలో కామవాసనలను అధికం చేస్తాయి కనుకనే బ్రహ్మచర్య పాలనలో ఘ్రాణేంద్రియాన్ని అదుపులో పెట్టు కొమ్మని ఆచార్యుడు ఆదేశిస్తాడు కృత్రిమ సుగంధద్రవ్యాలు హానికరమైనవి కాబట్టి వాటిని ముట్టరాదని కట్టడి చేస్తాడు గంధం పూసుకోరాదని, పూలుధరించరాదని హెచ్చరిస్తాడు బ్రహ్మచర్య జీవనానికి ఆటంకాన్ని కలిగించే వస్తువు ఎలాంటిదైనా, ఉపయోగించ రాదనేదే ప్రాచీన ఋషుల అభిమతం వారి దృష్టిలో సాత్త్వికజీవనమే ఆదర్శ జీవనం.

మనసన చెన్నప్ప

బ్రహ్మచర్యం మనకు గొప్ప సందేశాన్ని అందిస్తుంది అది జీవితసందేశం, తపస్సునే జీవనంగా గల్గిన ఋషుల సందేశం ఎవరు ఈ సందేశాన్ని విని ఆచరణలో పెడతారో వారే బ్రహ్మచారులు అట్టి వారికోసం ఈ దేశం ఎదురు చూస్తుంది

బ్రహ్మచర్యాన్ని పాటించి జీవితంలో గొప్ప గొప్ప విజయాలను సాధించిన రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, అరవిందుడు, గాంధీ మహాత్ముడు, భగత్‌సింహుడు, పండితగోపదేవుడు మనకు ఆదర్శం

తనను గొప్పవానిగా గుర్తించడమే బ్రహ్మచర్యం వీర్యరక్షణ గావించుకొనే వారి మనస్సులలో ఉన్నత భావాలు కలుగుతుంటాయి జీవితాన్ని ఉన్నతమైందిగా చేసుకొని, సర్వశక్తులను సమీకరించుకొని గమ్యం వైపు చేరడమే బ్రహ్మచర్యం బ్రహ్మచర్యాన్ని ఏ ఒక్కరో పాటిస్తే సరిపోదు స్త్రీపురుషులెల్లరు దీన్ని పాటించాలి సమాజానికి దీని అవసరం ఎంతో ఉంది బ్రహ్మచర్యాన్ని పాటించేవారు లేక పోవడంవల్ల సమాజం శక్తిహీనం అవుతుంది కనుక బ్రహ్మచర్యం కేవలం శరీరానికే కాక మనసుకూ, ఆత్మకూ, ఎంతో అవసరం

వ్యక్తిగతంగా మానవుని అభివృద్ధి, సమాజగతమైన వికాసం బ్రహ్మచర్యం వల్లనే సాధ్యమౌతాయి ఒక్క బ్రహ్మచర్యం మాత్రమే వ్యక్తిని పతనం కాకుండా చూస్తుంది సమాజాన్ని ముందుకు నడిపిస్తుంది బ్రహ్మచర్యం సర్వరోగాలకు దివ్యమైన ఔషధం బ్రహ్మచర్యానికి అర్థం క్రియాశీలత, శక్తి, ఉత్సాహం ఇంకా చెప్పాలంటే తేజస్సు. బ్రహ్మచర్యం వల్ల మానసిక శక్తుల వికాసం జరుగుతుంది. ఆత్మ ఉన్నత మార్గంలో సంచరిస్తుంది బ్రహ్మచర్య శబ్దం వీర్య రక్షణ అనే అర్థంలో ప్రయుక్తమై మనకందించే సందేశాన్ని మొట్టమొదట మనం ఆలకించాలి ఇదే ఋషుల ఆకాంక్ష

